# ఆంధ్రభూమి

సర్వవిషయములను చర్చించు
సచిత్రాంధ్ర మాసపత్రిక



స్థాపితము ౧౯౩౨
సాలుచందా 1-8-0

సంపాదకుడు
ఆంధ్ర శేషగిరిరావు, బి.ఏ.

సంపుట ౬ | బహుధాన్య, వైశాఖము మే, 1938 | సంచిక ౧౦


# కథావశేషుడు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

బహుధాన్య సంవత్సర చైత్ర శుద్ధద్వాదశీ సోమవారము మధ్యాహ్నము 2 గంటల 15 నిముసములకు తెలుగుసీమవారికి సర్వగ్రస్త సూర్యగ్రహణము కలిగినట్లయినది- వారిపాలిటి ఉద్ధారకుడు, విశ్వదాత, కళాప్రపూర్ణుడు అయిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు దివంగతుడగుటవలన

నాగేశ్వరరావు తెలుగువారి రాక్‌ఫెల్లర్ అమెరికన్ పౌరుడగు రాక్‌ఫెల్లర్‌వలె ఆంధ్రపౌరుడగు నాగేశ్వరరావుకూడ ధనమార్జించుట, దానముచేయుట అను కృత్యములతో తన జీవితమునందలి ప్రతిక్షణమును గడపినాడు

నాగేశ్వరరావు తెలుగువారి రాక్‌ఫెల్లర్ మాత్రమేకాడు అతడు తెలుగువారి నార్తుక్లిఫ్‌కూడ ఆంగ్లపౌరుడగు నార్తుక్లిఫ్‌వలె ఆంధ్రపౌరుడగు నాగేశ్వరరావుకూడ పలుపత్రికలకు జనకుడాయెను తెనుగువారి దినపత్రికారాజమగు ఆంధ్రపత్రికకు అతడే జనకుడు, తెనుగువారి అత్యుత్తమసచిత్రవారపత్రికయగు ఆంధ్రవారపత్రికకు అతడే జనకుడు, తెనుగువారి మాసపత్రికలకు మాణిక్యమగు భారతికి అతడే జనకుడు ఆంధ్రవార్తాపత్రికాప్రపంచమున ఇట్టిది అశ్రుతపూర్వము

నాగేశ్వరరావు తెలుగువారి రాక్‌ఫెల్లర్, నార్తుక్లిఫ్‌మాత్రమే కాడు అతడు తెలుగువారి మాసరిక్ కూడ జెకోస్లావాకియా పౌరుడయిన మాసరిక్‌వలె ఆంధ్రపౌరుడగు నాగేశ్వరరావుపంతులు ఆత్మదేశమును అవ్యక్తస్థితినుండి అత్యాశ్చర్యకరమగు అభివృద్ధికి తెచ్చెను

మనపాలిటి రాక్‌ఫెల్లర్, నార్తుక్లిఫ్, మాసరిక్ అయిన నాగేశ్వరరావుపంతులు—ఈ మువ్వురి మహనీయుల ప్రత్యేకగుణములను తనయందు ఏకీకృత మొనర్చుకొనిన నాగేశ్వరరావు పంతులు ఇక మనకు లేడు

మధ్యరాష్ట్రములందు తన దుకాణముండని పల్లెలేని వణిక్పుంగవుడు జమన్‌లాల్ బజాజు ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీకి ట్రెజరరు, అయితే ఆంధ్రరాష్ట్రమునందు తన అమృతాంజనము వెళ్ళని గ్రామము లేని వణిక్పుంగవుడు నాగేశ్వరరావు ఆంధ్రకాంగ్రెస్ కమిటీకి ట్రెజరరు అని ఇంతకాలము గర్వించినాము ఇకమీద ఆగర్వము చెల్లదు

మహాత్మగాంధి వాక్శుద్ధి, జవహర్‌లాల్ నెహ్రూ దేశసంచారదీక్ష, సుభాషబోసు కార్యశౌర్యము, మదనమోహనమాళవ్యా సమరసభావము అతనియందుండినవి

శక నిర్మాతయగు శాలివాహనుడు, బౌద్ధమతమునకు సంస్కారము తెచ్చిన నాగార్జునుడు, గృహ్యసూత్రములకు రూపసిద్ధినిచ్చిన ఆపస్తంభుడు, ఆంధ్రకవితకు శిష్టత్వమిచ్చిన నన్నయ మొదలగు ఆంధ్రమహాశయుల కుదిటికి చెందినవాడు నాగేశ్వరరావుపంతులు

ఆంధ్రదేశమున నవయుగప్రవక్తగా చెప్పబడుచున్న వీరేశలింగముపంతులు పాతపద్ధతులను ఎత్తిచూపినాడు నాగేశ్వరరావుపంతు

లు క్రొత్తపద్ధతులను మప్పి నేర్చి నాడు కోపల్లె హనుమంతరావు పంతులు ఒక్క విద్యలోనే ఆంధ్రు లలో జాతీయత కొనిరా ప్రయ త్నించినాడు నాగేశ్వరావుపంతులు సమగ్రమగు ఆంధ్రత్వమునకే జా తీయత కొనివచ్చినాడు వేయేల! అతడు ఆధునికాంధ్రదేశమున చే యక విడిచినది లేదు. ఆధునికాం ధ్రులు అతనిని విడిచి చేసినదియు లేదు

అతడు ఉచితముగా ముద్రిం చిన తెనుగు గ్రంథములు శతాధి కములు, అతడు పీఠికలు వ్రాసిన తెనుగు గ్రంథములును శతాధిక ములే. ఆంధ్రసంవత్సరాది సంచిక లకు అతడు ఏటేట వ్రాయుచు వచ్చిన ప్రస్తావికలు ఆయావత్సర ముల 'ఇయర్ బుక్కులై' యుండు నవి. ఆంధ్రసారస్వతమున ఇంతగా పర్యాప్తుడై యుండియు అతడుఆర్ష మతమును విస్మరింపలేదు. భారతి లో అతనిసాభిప్రాయవిశేషములు కానిండు, ఆంధ్రపత్రికలో అతని సం పాదకీయములుకానిండు పాఠకులకు భగవద్గీతను పరిచయముచేయునవి

అతడు సంపాదకుడు. పత్రికకు పెట్టుబడి పెట్టుటచేతనేకాదు వ్రా తకాడై దానిని నిర్వహించుటచే తను కూడ.

అతడు జమీందారు అంతమా త్రమున అతడు రైతులను పీడిం చువాడు అనుకొనకూడదు అత నిని రైతుగాడున్న జమీందారని యు, జమీందారైన రయితు అని యు పరిగణింపవలెను

అతడు యజమాని అయినను పనివారల అక్కరలను పనివారల కంటెకూడ బాగుగ తెలిసికొనిన పనివాడు అతడు

ఇట్లు ఒక్కచో ఇమిడియుండని ద్వంద్వగుణములు అతనియందు అపూర్వముగ మేళవింపుగొందినవి

మహారాష్ట్రనాయకుడు బాల గంగాధరతిలక్ చనిపోయినపుడు షౌకతాలీ మున్నగువారు శవవా హకులయినారు, పార్శీవర్తకు డొ కడు దహనమునకు ఎనుబదిమణు గుల మంచిగంధపుచెక్క ఇచ్చి నాడు. ఆంధ్రనాయకుడు నాగేశ్వర రావు చనిపోయినపుడు ప్రకాశము, సాంబమూర్తి మున్నగువారు శవ వాహకులయినారు, మద్రాసు మే యరు పుష్పమాల నిచ్చినాడు వం గనాయకుడు చిత్తరంజనదాసు మ రణించినపుడు అంతిమదృశ్యములు ఫిలుములకు ఎత్తినారు ఆంధ్రనా యకుడు నాగేశ్వరరావు మరణించి నపుడును అంతిమదృశ్యములు ఫిలు ములకు ఎత్తినారు మహారాష్ట్ర దినపత్రిక 'కేసరిని' స్థాపించిన తిలకు నకు అంతిమమున జరిగిన సమ్మా నమే ఆంధ్రదినపత్రిక 'ఆంధ్రపత్రి క'ను స్థాపించిన నాగేశ్వరరావు పంతులునకుజరిగినది వంగదేశమున వదాన్యుడుగా పేరుపొందినదాసున కు అంతిమమున జరిగిన సత్కార మే ఆంధ్రదేశమున వదాన్యుడుగా అపారయశమార్జించిన నాగేశ్వర రావుపంతులునకు జరిగినది

లలితకళలని చెప్పబడు సంగీ తము, చిత్రలేఖనము, కవిత్వము సమముగా- సరసముగా అతని పో షణమందినవి. మహాదానములుగా పరిగణింపబడు విద్యాదానము, ధన దానము, అన్నదానము సమ ముగా- సరసముగా అతని ఆచరణ కందినవి సప్తసంతానములు ప్రతి ష్ఠించినాడు అష్టైశ్వర్యము లం దినాడు పూర్ణపురుషాయుషజీవి యైనాడు అతని మరణము మనకు శోచ్యము కాదు.

శోచ్యమైనది ఈగరాని మన యప్పును మన మొక భంగినైన అ తనికి అతడు బ్రతికియుండగా తీర్చ లేకపోవుటయే ఇపుడైనను వెం టనే అతని శిలావిగ్రహమును, అ తనిపేర మదరాసున మెమోరియ ల్ హాలును నిర్మించి తెలుగువారు తాము కృతఘ్నులము కామనియు, తమనాయకరత్నమును పూజించు పద్ధతి తమకు తెలియుననియు లోక మునకు చాటవలసియున్నది.

సమగ్రాంధ్రజాతికి అవిశ్వదాత పరమపదించుచు చేసిన మహాదాన ములు రెండు ఒకటి, ఆంధ్రపత్రిక. —రెండు అల్లుడు శంభుప్రసాద్.

భారతీయులకు కాశీవిశ్వేశ్వరా లయమువలె ఆంధ్రులకు నాగేశ్వర ప్రతిష్ఠితమైన ఆంధ్రపత్రికాలయ ము సర్వజనసేవ్యమైనది సమగ్రాం ధ్రజాతికి అది గురుపీఠము, విశ్వ విద్యాలయము అది సర్వకాలము లకు అట్లుండునుగాక!

డైరెక్టరు

గూడవల్లి

రామబ్రహ్మం.




మ్యూజిక్ డైరెక్టరు

భీమవరపు

నరసింహారావు.

*For Booking Apply to:*

**SARASWATI TALKIES. LTD.,**

**BEZWADA.**

# గృహలక్ష్మిటాకీ

## చూచివచ్చిన నలుగురు మిత్రుల సంభాషణ

'ఎక్కుమామా, మేడెక్కుమామా' యిదే పాట—
హరిజనసేవాసమితిసహాయార్థం భోగంపడుచు నాట్యం.
నాట్యానికి మధ్యగా తెరపై యడ్వర్టయిజుమెంటా?
అరవవలలాంక వేషధారులు—వాసినచుట్టిన ఆవకాయకుండలు.
ఆపురుష వేషంలో మాధురిజట్టు టోపీ గో పడలేదు.
నిద్రలేనిరాత్రులు వెళ్లబుచ్చుతూ గృహలక్ష్మి అంతవలం అయిందేం?
బ్రాందిసీసాతో కొట్టిన ఎంతసేపటికీ పడిపోవటం, రాధ?
డాక్టర్ గారింట్లో రేడియోసెట్టు ఉన్నట్లు కనిపించకుండా రేడియోపాట.
గోడపక్కని దాక్కునివున్న డాక్టర్ని చూసికూడా
పోలీసు రెండో ప్రక్కకేపోయాడు డైరెక్షన్ ప్రకారం.

రచయిత
వినోదభట్టార్

౧

వేసంగి ఖుషీమహలు, హాసలీలాస్వనాల, ప్రభాతరోచిస్సులమలపి, హస్తమాధురీవిన్యాసాలల్లో, వెలుగు లీనుతోంది షుమారు ఎనిమిదికి తక్కువై ఉండదు

ద్విచక్రశకటవాహనుడు నారదుడు-రాయుడు- ఛట్ న వచ్చి వాలాడు, నవ్వుకుంటూ. ఇతడు వచ్చాడంటే మాకు, రోజుకో, రోజున్నరకో సరిపడ్డంత 'టాపిక్' యిచ్చిపోతాడు. ఇఖ చూడండి, మాలో మేం పూర్వపక్ష సిద్ధాంతాల్ని చేసుకుంటూంటే, ఎవరు 'చిత్ర' య్యారో అక్కర్లేని ఆతడు, తన శకటానికి మళ్ళీ పనిచెప్తాడు

మా మర్చంట్, అచ్యుత్, గజాలల్లోనూ, అణా పైసల్లో నేకాని, కళల్ని, కొలవలేడు తెల్లారిందా 'కాఫీ-కాఫీ' అనే కలవరింపుల్లోనే ఆతని నేత్రాలు విడివడటం.

గవర్నమెంటు అప్పు- కాఫీ- తీర్చి, అప్పుడే కుర్చీలల్లో ఆసీనులమైనామో లేదో, గోపాలుడు శ్వేతచుట్ట(సిగరెట్) ధూమాన్ని ఆషామాషీగా వదిలేస్తూ సిద్ధం, బల్లకట్టుదాటి- యమునాతరంగిణీడోల! వాడూ, వాడి యిన్సూరెన్సుకట్టూ, బంగాళీవేషం-

'నిన్నరాత్రి సువ్వొక్కడవే లోటు' మర్చంటుని చూసి, నారదుడన్నమాట

'ఏ, ఎండోమెంటో చేసుంటే, రాధకి ఆతిప్పలుంటాయా? ముఖ్యమైందే మరచిపోతే! సౌందర్యానికి దెబ్బతస్తే యిచ్చేందుకు వీలుగా, మాధురీ, ఆస్నిగ్ధక పోలాల్నీ,- అబ్బ- ఆకళ్ళనీ, యిన్సూర్ చేసుకోదూ? ప్చ్' అన్నాడు గోపాలుడు ఏంచెయ్యం అన్నట్టు.

'ఓ కథచూస్తే, అన్నీ చూడక్కర్లే. ఆంధ్రానుకరణం- అనుకోకపోయినా- వంటబట్టి, స్వంతమే అనుకోనేట్టు చేస్తుందిరా. శాస్త్రీ, నేనూ మీకంటె ముందే మాస్తాంలే, మద్రాస్ లో, మాతర్వాతే!-' అనేశాడు అచ్యుత్.

'ఇల్లాంటి ఫిల్ము! చూసావా అంట! నాచురల్ గా ఉందిలే మైనర్ '

'హాష్హో! నారదుడురా, మైనర్ అన్నావూ ?' అన్నాను నేను.

'కవీ,- అల్లాంటి సంఘటనలకి పోనిచ్చావేం?! అదిగో మనవాడు ముఖం చిట్లిస్తున్నాడు. ఏడూ కవేగోయ్!' గోపాలుని హుఌ్యామర్

'అదికాదర్రా. కవి ఒక్కడేనా మీకళ్ళల్లో దూలంగా కన్పడేది? 'ప్రజామిత్ర'లో యీమధ్య 'ఆనందవికటన్ వారితో యింటర్వ్యూ' అంటూ వ్రాస్తూపైన ఓకార్టూన్! డైరక్టర్ పులికి కవి మేక కలం- కలమేమిటి- కవే ఎల్లాగైపోతాడో చిత్రించారు' అన్నాను

'ఎక్కుమామా, మేడెక్కుమామా' యిదేపాట, ఏవీధిని చూసినా. బలే కళ కట్టిందిలే, ఆడుంగల్ని త్రిప్పటం మూలాన్ని' నారదుడు, తన ఆహ్లాదాన్ని వెళ్ళబోసాడు

'చెప్పరా అచ్యుత్! అనుకరణమన్నావుకా మరీ?' ప్రశ్నార్థకపు చూపులు ఫోకస్ చేసాడు ఇన్సూరెన్సువాలా.

'అల్లా నాకు తెలియదు. ఫలానా ఫలానా అని మొదట్నించీ చెప్పకురా. ఉండు కవిని చెప్పనీ' అన్నాడు మర్చంట్.

'ఇప్పుడిప్పుడే, పురాణకౌటుకకొండల్ని, జారుతూ, పడుతూ, దాటి, ప్రాక్పశ్చిమవిజ్ఞానపుటంచు లోరనుకొనే నాగరకరదనలో కాలిడిన, భారతఫిలుం పరిశ్రమ, గెంటుకు, వచ్చినా, వెనుకటి కౌటుక, లత్తుకలా నిలచిపోయిందింకా, అరికాళ్ళల్లో ' అంటూన్న నామాట

[౪౬౩ పేజీ చూడుడు.

# తిక్కన్న - కీచకుని వలపు

[జనవరి 'ఆంధ్రభూమి' సంచికలో శ్రీయుత దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు సంగ్రహించి ప్రచురించిన తిక్కయజ్వ కీచకునివలపు ఘట్టపు పద్యములనుగూర్చియు, వారు తలపెట్టిన భారతకథాప్రబంధప్రచురణమును గూర్చియు ఆంధ్రవిద్వాంసులు పంపిన అభిప్రాయములలోనిది యొకటి —సంపాదకుడు]

౧౦

సంధానము—1-2

ద్రౌపదీరూప మను నురియందు తనదు హృదయ మను మృగము చిక్కికొని కాముడను వేటకాని బారిపడుటకుం జింతించి కీచకుండు ద్రౌపది యున్న యెడకుం జని యనికదా!—

దీనివలన ద్రౌపది యున్నయెడకుం గోకమునుపే కీచకునకు ద్రుపదాత్మజపై ననురాగ ముద్భవించినదనియుం దరువాత నాత డామె యున్నచోటికిం బోయెననియుంగదా తెలియుచున్నది. ద్రౌపదిని కీచకుం డెప్పుడు చూచెను? ఏప్రదేశమునం గాంచెను? ఎట్టిస్థితిలోం గాంచెను? అట్టిసమావేశమును సూచింపకయే ద్రౌపదీరూపమను నురిలోం దగుల్కొనినాండనిన నేమి విశేషము! అట్లు కాదు. అదివఱ కొకపరి చూచి యనురాగమును బొంది యప్పుడామెనువిడిచి వెళ్ళినాడు నేడు రాగము మిక్కుటమై వచ్చినాడందురా? అట్లు విడిచి వెళ్లుట కీచకుని స్వభావమునకు విరుద్ధము—ద్రౌపదీరూప మను నురిందగిలిన కీచకహృదయమృగము ఎట్లు విడిచి పోంగలదు? ఉరిందగిలిన మృగము పోవుట యెక్కడిది? పైంగా వేటకాడు సన్నిహితుడై యుండె ఇట్టి సంఘటన మెన్నడో జరిగినది ఇప్పుడు ద్రోవదిని సమీపించినాడనుటలో రెడ్డిగారనౌచిత్యమునే సాధించిరి

కవిబ్రహ్మయో యప్పగారిని సందర్శింపంబోవుచున్న కీచకునకు హఠాత్తుగా ద్రోవదిని గనంబఱచినాడు—కీచకుని దృష్టి యామెపైం బ్రసరింపంజేసినాడు. దృష్టినిలుపంజేసినాడు. అతని హృదయమృగమును రూప మను నురిలో బంధించినాడు. కావుననే కీచకుడు తాను ముందుంజనుటకు నుద్యమింప లేకుండెను నిశ్చేష్టుడయ్యెను. చూచితిరా కవిబ్రహ్మ సృష్టి! ఔచిత్యమెందుంగలదు?—

సంధానము—3

కీచకుండు ద్రౌపదిని సమీపించిన తోడనే ద్రౌపదికిం బరితాపముచే స్వేదము—కంపము మున్నగు వికారములు గలిగెననియు నవి యామె కొదవిన మదనవికారములుగా భావించి కీచకుడు రాగసాగరమున నిర్మగ్నుడయ్యెనని కదా—

కీచకుడు ద్రౌపది యున్నయెడకుం జని యనియే 2 వ సంధానమునందు రెడ్డిగారు వచించుటచే నింతకు నాత డామెను బరికింపలేదు- (రెడ్డిగారే 4 వ సంధానములోం గీచకుడు ద్రౌపదినిం జూచుటం జెప్పుచున్నారు) పలుకరింపలేదు. సైగయైనను జేయలేదు. అట్టిచో నిట్టి వికారములు ద్రౌపదికిం గలిగెననుట సమంజసమా! కీచకు డెందులకు వచ్చెనో- అత డెవడో- ద్రౌపదికిం దెలియదు సహజముగాం బతివ్రతయగు స్త్రీ పరపురుషుడు తనవంకకు వచ్చుచున్నం దొలగును. అంతియే కాని విపరీతమైన శోకభయావలు తత్క్షణమే పొంగుననుట ప్రకృతివిరుద్ధము అదియునుంగాక కీచకు డామెను జూడకయే- యామె యందచందములకు మురియకయే- యాబిడను గుఱించి వినకయే- తన కోర్కికయ్యది విషయముగాం గలదని యూహింపకయే రాగసాగరనిర్మగ్ను డయ్యెననుటలో నేమి యౌచిత్యముగలదు? తనయందు రాగమును బెంపొందింపం జేసికొని తన వలెనే యాబిడయుం దన్నుం బ్రేమించుచున్నదా? లేదా? యని యామెను జక్కంగాం బరికించి హావభావవికారములచేం దన్నుం బ్రేమించెనని యెఱుంగుట ప్రకృతిసిద్ధము. అట్టిస్థితిలో ద్రౌపది యున్నయెడకుం గీచకుడు పోంగనే యిట్టి రసపరిణామదశ కల్గెననుట హాస్యాస్పదము—

తిక్కయజ్వ యీవిషయము నెట్టిస్థితిలోం జెప్పినాడో పరికింతము. అప్పయొద్దకుం బోవుచుం గీచకుడు ద్రౌపదినిం జూచి యనురాగమును బొంది యామె సౌందర్య మనునురిలోం జిక్కికొని నిలువంబడి 'ఆహా! యేమి సౌందర్యమని సాముదాయికముగాం బ్రశంసించి యింతటి సౌందర్యవతి యెచటను లేదని రూఢి చేసికొనినాడు. తరువాత నతనికి నింత సౌందర్యవతియగు నీమె యెవ్వతెయో? యీమెను గన్న తల్లిదండ్రు లెవ్వరో? దీని పేరేమో? దీని భర్తయెవ్వండో? ఇదియుండు నిల్లెక్కడనో? ఇట్టి సుందరాంగి నాకెట్లు లభించునో? యీకార్యమున నాకు దూతికాకృత్యము నిర్వహింపంగలుగువారెవ్వరో? యను విచారములు పొందినాడు- సౌందర్యమును బట్టి రాణిగా నుండందగిన

యామె రాణి పరివారమున నుండుట కాతని కాశ్చర్యమొదవి యీమె తల్లిదండ్రు లెవ్వరాయని యనుటలో నాతఁడు జాతివిచారము చేసినాడు- ఏలయన సౌందర్యవతియయ్యు నీచకులమున జన్మించిననే యూడిగపుదికొఁ దగినదియని తలంపు- సామాన్యముగా లోకములో వారివారికిఁగల సౌందర్యాదులను బట్టియే స్త్రీలకుఁ బేరిడుదురుగదా! (ఇప్పుడు కాదు- పూర్వకాలములో) ఇట్టి సౌందర్యవతికి నేమి పేరు పెట్టఁబడెనాయని విచారించినాఁడు తరువాత నింతటి సౌందర్యవతి సౌందర్యము నాప్యాయనముగా ననుభవించుచున్న యీమె మగఁడెవ్వఁడోగదా! అతడీమె స్థితినిబట్టి మహావీరుడుగా- రాజుగాఁ- బరిగణింపఁబడడు గావున నేకొద్దివాఁడో యయియుండును, అట్టివాఁడెంత యదృష్టవంతుఁడో కదాయని యాతని యదృష్టమునకు మెచ్చుకొనినాడు- తరువాత నీమె నివసించు గృహ మెచ్చటనో- యీమెతోఁ బరిచయముగల్గుటకు మార్గ మెట్లో యని విచారపడినాడు- కీచకుడు పరనారీసంగమాభిలాషు డయినను అరసికుడుగాడు నాయకిని వలచి వలపించికొని భోగింపఁదలఁచువాఁడే. అంగీకరింపకున్న దౌర్జన్యమును గనఁబఱచువాఁడే కాని మొదటినుండి యరసికత్వమును జూపువాడుకాడు కావుననే దూతికావిచారము చేసినాడు ఇట్లాలోచించుచుండ నతనికి మన్మథవికారము లధికమయినవి అప్పుడాతడు తనభావమును బ్రకటింపక నిలువలేకపోయినాడు- అప్పుడు వాని చూపులు మాఱినవి- పరస్త్రీనిఁ బలుకరించుటకు జంకుచు నచటఁ గలవారి కఁజూచుచు ద్రౌపదివంకఁజూచుచు వఁబడి ముఖముననుు, జూపులయం ం దనభావమును వెల్లడించినాడు ప్పుడు ద్రౌపది కీచకుని మనోభిప్రాయమును గనుగొనినది. నిశ్చేష్టతనొందినది- కంపించినది- చెమ్మటలు విడిచినది- దిగులువడి వెల్లనయినది- తన వలపునకు మాఱువలపుగలదా? లేదా! యని పరికించు కీచకునకు నామెకుఁ గల శోకవికారములు మదనవికారములు గాఁ దోఁచినవి అది సహజమేకదా!—అప్పుడింకేమి? నాకోర్కి సఫలమగునని యతడానందము పొందినాడు కవిబ్రహ్మ యింత చెప్పి వానిని రాగసాగరమునఁ బడవైచిన రెడ్డిగారు ముందుగానే సాగరమున దించినారు- ఔచిత్యమెందో విచారింపుఁడు

## సంధానము—4,5,6,7

రాగసాగరపూరనిమగ్నుడైన తరువాత ద్రౌపదిని జూచినట్లు కామవికారములు పొందినట్లు తెలియుచున్నది రాగసాగరపూరనిమగ్నుడైన తరువాత నీతడు చేయు నీవికారము లనుచితములు-ఏలయన, 'రాగసాగరపూరనిర్మగ్నుఁడయ్యె' అను పద్యములోననే ద్రౌపది తన్ను వరించినదనియు నామెకును మన్మథవేదన జనించినదనియుఁ గీచకుడు విశ్వసించియున్నాడు. ముదితుఁడైనాఁడు ఇప్పుడతని హృదయములోఁ గొంత స్థిమిత మేర్పడినది ఇటుపైని నాతఁడింకను నామె సౌందర్యామృతమును గ్రోలుటయు నామెతోఁ బరిచయముఁ గలిగించికొని కార్యము సానుకూలము సేసికొనుటయుఁ గావింపవలసియున్నది. అట్టిస్థితిలో నీతొట్రుపాటునకుఁ గళవళమునకుఁ గారణముగాని, స్థానముగాని కానరాదు

కవిబ్రహ్మ కీచకునకు ద్రౌపది మేనికాంతిని గనఁబఱచి లలితగతిని యామె ప్రత్యవయవశోభను బ్రకటించి చిత్కళలఁగాంచి తన్మయతనొందు యోగివలె నామె కాంతిపుంజమున నతనిఁ దన్మయుని గావించినాడు అప్పుడు కీచకుడచటవారు చూచుచున్నారను సిగ్గయినను లేక ద్రౌపదివంక కట్టై చూచుచు నిలువఁబడినాడు అపుడు కీచకుడు ద్రౌపదిని సమీపించుటకేనియుఁ బలుకరించుటకేనియు సాహసింపనేరక యామె వృత్తాంతమును దెలిసికొనవలయునని బలవంతమునఁ దన దృష్టు లామెనుండి మరలించికొని యప్పుకడకుఁ జని నమస్కరించిన నామె పీఁటవైచి 'కూర్చుండు'మని సంభావించునెడ 'హృదయమునందలి యావేగమును బట్టఁజాలక' యాబిడ కులమేది? వృత్తాంతమేమి? పేరేమి? మగడెవ్వడు? ఎక్కడ ఎప్పుడుండును? ఇక్కడ కేమిపనిమీఁద వచ్చినది? దీనిమీఁద నీకెంత ప్రేమగలదు? అను ప్రశ్న పరంపర నూపిరి ద్రిప్పికొనకుండ గ్రుమ్మరించివైచినాఁడు. హృదయావేగముగలవాని వాక్యము లిట్లుండక యెట్లుండును? సుదేష్ణయాపలుకులు విని విననిదానివలె సమాధానమీయక మఱియొక ప్రసంగము దీసికొనిరాఁగా కీచకుడిఁక లాభములేదు. ఆబిడనే యడిగి కనుగొందమని సత్వరుఁడై ద్రోవది యున్నచోటికిఁ బోయినాడు. పోయినవాడు వెంటనే పలుకరింపఁగలిగినాడా? అట్లుచేయుటకు వాఁడేమి రసికత యెఱుఁగనివాడా? నాగరికుడు గావున నటునిటుఁ గొంచె మట్టాడినాడు అట్టాడుచు నామె తల్లిదండ్రులను భర్తను బ్రశ్నించినాఁడు. ఆమాటలకుఁ బాంచాలి విననిచందమున నిర్వికారయై తనపనిఁ జూచుకొనుచుండెను.

## సంధానము—8-9

మనోజవికారనిమగ్నుడై కళవళించుచున్న కీచకుడు ద్రోవది నడుగుచున్నాడు- ఎంతటి కామోద్రేకియైనను జూపులచేఁ గొంచెము పరిచయము గల్పించుకొని తనయందుఁ బరస్త్రీ కొంచె మనురాగము గలదిగానున్నదని కొంచెమైన విశ్వాసము గలిగినప్పుడు పలుకరించుటకు సాహసించును అట్లు పలుకరించుట కాతనికి చిత్తస్వాస్థ్యముగూడ నుండును. కళవళించుచున్నవాడు పలుకరించినాడనుటలో నేమి

సారస్యము గలదు? అదియునుంగాక దావలఁచిన పడఁతిని దూతికమూలము గా రసికులు వశపఱచుకొనుటకుఁ బ్రయత్నింతురు. అందుకొఱకే కీచకుడును (కిం' భారతములో) నాకు సహాయ పడుచుట్ట మెవరాయని విచారపడినాడు- కావుననే సోమయాజి కీచకుని సుదేష్ణయొద్దకుఁ బంపి ఆమె యొండుపలుకు లాడుటచేఁ గీచకుడు ద్రౌపదియొద్దకుబోయి కొంచెమట్లాడి పలకరించినటులఁ జెప్పియున్నాడు- సంధానములోని సరాసరి యవ్యక్తప్రసంగమనౌచిత్యము నరసికత్వమును సూచించుచున్నది.

## సంధానము 10, 11, 12, 13, 14, 15

రెంటను సమానము.

## సంధానము—16, 17.

వెరవుతోఁ దప్పించుకొనఁదలంచిన ద్రుపదాత్మజచే గడుసుగా మాట్లాడించి నీకొడుతోఁబుట్టువులు లేరా? యని మొదటనే యనిపించుట యనౌచిత్యము గానున్నది. ఏలయనఁ గ్రూరుడగు వానితో సౌమ్యముగా మొదట మాట్లాడవలయును. వెరవుతోఁ దప్పించుకొనవలెననిగదా యామె ప్రయత్నము. ఇందు వెరవు భంగపడుట లేదా?

కావుననే తిక్కయజ్వ ద్రౌపదిచే నెట్లు చెప్పించినాఁడో చూడుఁడు. 'అన్నా!' యని సంబోధింపఁజేసినాడు నాసితి- నాముతికిచీర- నాయసంస్కృతదేహము కామమును గల్గించుననుట తగని మాటగదా! యని యనిపించి యంతతో నాత డవతలకుఁ బోకుంటచే 'సజ్జనులిట్లాడుదురా! నీకొడుతోఁబుట్టువు లున్నారుగదా- నేను నీచకులములోఁ బుట్టినదానను- న న్నడుగవచ్చునా?' యని చెప్పించినాడు- రెండవ పద్యభావమునకు మొదటి పద్యభావము పోషణము- అది లేకుంట అతుకుచెడుట- అసంగతమేర్పడుట.

## సంధానము—18-19.

ద్రౌపదివాక్యములను వినిన కీచకుడు నతత్క్షణమే యతివాదము చేసినాడు కాని సౌమ్యవాదము నవలంబింపలేదు- నాయకుఁడు నాయకి నెట్లయిన ననునయముచే వశపఱచుకొనఁ జూచును గాని కఱకుఁదనము నెఱపడుగదా! కఱకుఁదనము నెఱపుట రసికతకు- నౌచిత్యమునకు విరుద్ధము

కవిబ్రహ్మ కూర్పునలో కీచకుడు వెంటనే బిరుసుగా మట్లాడక యామెను బ్రత్యవయవవర్ణనమును జేసి స్తోత్రము నేసి వశపఱచుకొనఁ బ్రయత్నించినాఁడు- స్త్రీ సౌందర్యముచే గర్వించునది- తన సౌందర్యమును బొగడిన నామెకు నానందము గలుగుట లోకసామాన్యము కావునఁ గీచకుడట్లుచేసి తరువాత 'నీవు దుర్జాతివిగావు- నేను బరస్త్రీసంగమ పాపమును భరింతును- నిన్ను భోగింపక నిలువలే'నని మొత్తుకున్నాడు-

## సంధానము—20-21-22-23.

19-వ సంధానములో జంకించినఁగాని పోడని యామె జంకించినటులుండ నీసంధానముచే నామె హితబోధ మొనరించినటులే కానవచ్చుచున్నది 'హితమే?' యని యామెయే యనుచున్నది? ఇక్కడ రావణాదుల ప్రసక్తికిఁ గారణము గానరాదు

21 అంత సైరంధ్రి సైరణదక్కి- ఇక్కడ సైరణదక్కి యని యేల వ్రాయవలెను? సైరణదక్కు టకుఁ గారణమేమికలదు? 20 చెప్పినతోడనే 22 చెప్పవచ్చునుగదా- నడుమ నీయతుకుముక్క నిష్ప్రయోజనమగుచు నసందర్భమును సూచించుచున్నది-

22 లో ద్రౌపది తనభర్తలను వర్ణించి 'నీమానముఁ బ్రాణమును గొందురు, అది తథ్యము-' అని చెప్పుచుండ నావచనమునకుఁ గీచకుడు తన్నెవ్వరు గెల్వలేరని ప్రగల్భమాడినవాడు. అతని ప్రగల్భవచనమునకు ద్రౌపది ప్రతివచనము లేకుండినది కావున కీచకుని స్వోత్కర్షవచనమును విని ద్రౌపది సమ్మతించినటులే యగుచున్నది- మూఁడవపాత్ర ప్రవేశించుటచే సంభాషణ మాగిపోయినదందమా యదియు జరుగలేదు సంగ్రహీత సంధానానుసారము సర్వ మామె యెఱిఁగియేయున్నది గాన సంభాషణ మాఁగఁబనిలేదు అదియుఁగాక సైరంధ్రి సుదేష్ణ సైఁగచేతనే కదా కొనిపోఁబడినది

కవిబ్రహ్మ కల్పనమునందో ద్రౌపది 'జంకించినఁగాని యితడు పోడ'ని గంభీరభాషణములతోఁ బతులపరాక్రమాదులు వర్ణించి 'కీచకా!' అని సంబోధించి 'మానము బ్రాణము గొనుట తథ్యంబ'ని ఘంటాపథముగాఁ బలుకఁ గీచకుడు తన బాహుబలమును బ్రశంసింప నప్పు డామె సైరణదక్కి 'వివేకవిహీనా! నీవు యోజించుటలు లేదు నీవు రావణాదులకంటె బలముగలవాడవా? పరస్త్రీసంగమాభిలాషచే వారు నశింపలేదా?' అని యనినది. ఇందు 'సైరణదక్కి'యను పదము సార్థకమగుచున్నది. కీచకునకు నింకేమి పలుకుటకుఁ దోఁపకున్నది అప్పు డత డప్పకడకుఁ బోవలసివచ్చినది- ఔచిత్యమెందో విచారింపుడు.

## సంధానము—24.

సుదేష్ణ యీసందర్భమున వచ్చినట్లు చెప్పఁబడినదిగదా — ద్రౌపదీకీచకుల సంభాషణము వినినట్లే కాదా? తమ సంభాషణము సుదేష్ణ వినుచున్నదని ద్రౌపది యెఱిఁగినట్లే కాదా! అట్టిస్థితిలో ద్రౌపది సుదేష్ణతోఁ గీచకుని చెయిదమును గుఱించి వానిముందఱనే యేల ప్రసంగిపదు? చీవాట్లుపెట్టించి యేల పంప ఇంతకు సుదేష్ణ యిక్కడకేల రావలెఁ కీచకుని వారించుటకే వచ్చెనందు. అది ద్రౌపది సమక్షముననా? పరోక్షముననా? సమక్షముననే యని చెప్ప

తోఁ దరువాత నాసవమునకు నెట్లు పంపఁగలదు? అప్పు డేమియొఱుఁగనట్లు గానే మాట్లాడెఁగదా! కావునఁ బరోక్షమునసే- మాట్లాడెనని చెప్పవలసి యుండ సుదేష్ణ సైఁగ సేసి పరిజనముచే ద్రౌపదిని శయనగృహమునకుఁ జేర్చెనని యేల చెప్పుట- ఇది కథాసంవిధానమునకు విరుద్ధము- ఉత్తరకార్యనిర్వహణమున కంతరాయకము- ఇట్లుండఁ జెప్ప వచ్చిన సుదేష్ణ నట్టె నిలఁబెట్టి కీచకుఁడు మన్మథోద్రేక మెక్కుడయి యనంగుపట్టి యాడెడు జంత్రంబువగిది నున్నాఁడని సంధించుట రసాభాసమును గలిగించుచున్నది.

## సంధానము—27-28.

ఇక్కడ కథ వెనుకకు నడచుచున్నది. ద్రౌపదీకీచకుల సంభాషణము ముదిరినది. చెడుదువని యామెయుఁ జెడను- నిన్ను విడువనని వాఁడు- పట్టుదలతో నున్నారు -ఇఁకఁ గీచకుఁ డీమెను సులభముగా స్వాధీనపఱచుకొను నుపాయమును వెదకుట కర్తవ్యమై యుండ నిప్పుడు మన్మథోద్రేకము ముదిరినదని చెప్పుట యసమంజసము- విరసము-

కవిబ్రహ్మ పూర్వనందో కీచకున కట్టి సమాధాన మిచ్చి లేచిపోయిన ద్రౌపదితో మాట్లాడుటకు మొఱవెట్టికొనుటకైన సాధ్యముగాక తనయప్ప నే బతిమాలికొందమని కీచకుఁ డప్పయొద్దకుఁ బోయినటులఁ జెప్పినాఁడు- ద్రౌపది యనిష్టవచనము లింక వినుట కిష్టము లేక వెడలిపోవుట సమంజసమే కదా? తోడి పరిజనముగాని రాణిగాని మఱెవ్వరుగాని యియ్యది వినిన తలవంపు గావున నామె తనంతటనే లేచిపోయినటులఁ గల్పించుట ఔచిత్యమునకుఁ బట్టుఁగొమ్మ- 'ఇంతసేఁపు నీచేరువనుండి యిప్పు డెట మెలఁగె' నని కీచకుఁడడుగుటలోననే యియ్యది వ్యక్తమగుచున్నది-

## సంధానము—29.

ఇందులో సంధానకర్త గల్పించిన వృత్తము హేయము- అభిమానవతియగు ద్రౌపదికి నవమానకరము- ముందొసవమునకుఁ జనుట కేమాత్రము సావకాశము నొసంగనిది.

## సంధానము—30,31,32.

ఇప్పుడు కీచకునకు దూతిక గావలసి వచ్చినది- అప్పదగ్గఱకు పోవుదమనుకొనినాఁడు- ఆబిడయొద్దకు వెళ్లినాఁడు- ప్రథమమునఁ దిక్కయజ్వ కీచకుని సుదేష్ణయొద్దకుఁ బంపినపుడు పలికించిన మాట లిప్పుడు పలికించినాఁడు- దీనివలన నీసంగ్రహీత యేమి సాధించినాఁడు? అక్కడ ఔచిత్యమును భంగపఱచి యిక్కడ అనౌచిత్యమును గల్గించినాఁడు- ఎట్లన —

24వ సంధానములో సుదేష్ణవచ్చి—26 సంధానములో 'నానేర్చుకొలంది వారించిచూచెద గాక' అని సంకల్పించికొనినదిగదా! ద్రౌపదిని బంపివైచినదియు నామెయేగదా! వెంటనే యామె యుపన్యాసము నారంభించుట యుచితమా? మొద్దువలె నిలువఁబడుట యుచితమా? కీచకుఁడెవ్వరు సహాయపడుదురా యని పరితపించుటయు నప్పయే యీపని నెరవేర్చి పెట్టునని తలంచుటయు నప్పయొద్దకుఁ బోవుటయు 'చని మదనాగ్ని ..' అను దానిచేఁ జెప్పఁబడుచున్నది. ఆమె యక్కడకువచ్చియే యున్నదనియు —ఆమె వారింప యత్నించుచున్నదనియుఁ జెప్పి యామెయొద్దకుఁ 'జని'యని చెప్పుటయేమి యౌచిత్యము?

## సంధానము—34

ఇదియు స్థానపతితము- కవిబ్రహ్మ సుదేష్ణచే మృదురీతిని గీచకుని ప్రయత్నము నుడిగింపఁదలఁచెఁ గావున ప్రసంగాంతరమునకు సుదేష్ణ కీచకుని లాగెననియు నతఁడు గ్రహించి లేచి ద్రౌపదికడకుఁ బోయెననియు 'ఒండుపలుకులు జరపిన' అను దానిచేఁదెలియఁజేసె. ఇచటనో సుదేష్ణ నేర్చుకొలంది వారింపుటకే బద్ధకంకణయయ్యె. కీచకుఁడడుగకప్పటికి నామె యొండుపలుకులకుదింపినది. ఏమి యీయనౌచిత్యము!

## సంధానము—35.

ఒండుపలుకులుపలికినఁ గీచకుని సమాధానము చూడుఁడు- ఒండుపలుకులు పలికవనఁగాఁ బ్రస్తుతప్రస్తావనాంశమునకు భిన్నవిషయైకవచనము లేగదా! అందులకు సమాధానము 'నాకొలువువారి కారు ' అని కీచకుని సమాధానమా? ఇది కావ్యమునకు నూత్నమర్యాదయు గౌరవ్యము నగునా?

తిక్కనమహాకవియో సుదేష్ణకును గీచకునకు జరిగిన సంభాషణమును రహస్యముగానే యుంచినాఁడు. కీచకుని సుదేష్ణయొద్దకుఁబంపినాఁడు. అక్కడ సుదేష్ణతో నిదివఱకే ద్రౌపదీప్రసంగము తెచ్చినాఁడు గావున 'ఇందాఁక నిన్నడిగిన యతివ యెక్కడకుఁ బోయినది?' యని యడిగినాఁడు- (సుదేష్ణ పాత్రౌచిత్యవిమర్శనమునకు నిది తావుగాదు కావున నామెనుగుఱించి యేమియు వ్రాయఁబడదు) సుదేష్ణ 'న నేర్చినకొలంది నతని వారింపఁ బ్రయత్నింతు'ననుకొని వెంటనే 'నాయనా! నీయంతఃపురకాంత లింతకంటె సుందరాంగుల'ని ప్రశంసించి యిది యూడిగపుద' ని [illegible] ను బ్రదర్శించినది. అందులకుఁ గీచ[illegible] 'నాకొలువువారే గారు నాకలోకమున వారు నింత సౌందర్యముగలవారు కా'రని పలికినాఁడు చూచితిరా కవిబ్రహ్మ యౌచిత్యపోషణము- తరువాత సుదేష్ణ కీచకునకుఁ బరదారరతివలని పాపమును- అపకీర్తిని- సుఖము లేకపోవుటను జక్కఁగ బోధించినది. అంతకుఁ జక్కఁబడకున్న దానికి నేవురు మగ లసాధ్యులు గంధర్వులున్నారని చెప్పినది.

సంధానము—46.

45 లో నీవు వెళ్లుము. ఎట్లయిన కార్యము సానుకూలముచేయుదువని చెప్పఁబడినది. అంతమాత్రమున నాతఁడు విడుచువాఁడుకాదు. అంత యుద్రేకము లోనున్నవా డెప్పుడెట్టు లెక్కడ నా కోర్కి నెరవేర్తువని యడుగకుండునా! అసంగతి చెప్పనిది పట్టినకాళ్లు విడుచునా ? కావుననే కవిబ్రహ్మ 'అసవమునకని' యను పద్యమును జెప్పి కీచకుని సాగనంపినాఁడు. సంగ్రహీత యాపద్యమును త్యజించుటచే కీచకుని పట్టుదల-ఆవేగము- వృధయగుచున్నది. ద్రౌపది కోసము కీచకుఁడు వేచియుండుటకు నవకాశము లేక పోవుచున్నది- కావున నిది కథాశుద్ధికి, సందర్భమునకు ననౌచిత్యము నే యాపాదించుచున్నది.

—రెడ్డిగారికి మనవి—

అయ్యా! తమరు భారతమునందలి మాహాత్మ్యములను దెల్పుఘట్టములఁ దొలంగింపఁ దలఁచితిరిగదా! మాహాత్మ్యమ మానుషము (మానవాతీతము) అని యభిప్రాయముతోఁడ నేగదా!

భీష్ముని జనన మమానుషము- ద్రుపద ద్రోణకృపుల జననము లమానుషములు- సత్యవతి జనన మమానుషము- వ్యాసుని పుట్టు వమానుషము- పాండుధృతరాష్ట్ర జననము లమానుషములు- పాండవుల జనన మమానుషము- మీరు చెప్పనట్లయి నచో హేయము- తుచ్ఛము- ఉత్తమ మానవగౌరవమునకు భంగము- గాంధారీ యేలపుట్టు వమానుషము-దృష్టద్యుమ్ను ని జనన మమానుషము. ద్రౌపదిజనన మమానుషము- ద్రౌపదీవివాహ మమానుషము. కర్ణునిపుట్టు వమానుషము ద్రౌపదీమాన సంరక్షణ మమానుషము- గంధర్వనిరోధ మమానుషము- అర్జునాస్త్రసంపాదన మమానుషము- నాగలోకాదియాత్ర లమానుషములు- భీష్మునిస్వచ్ఛందమరణ మమానుషము- సంజయుని తెలివి యమానుషము- భారతయుద్ధమున నస్త్రముల ప్రయోగ మమానుషము- పాండవ స్వర్గారోహణ మమానుషము- ఆదిమధ్యాంతము లమానుషమగు మహాభారతమునందు మీ రమానుషములు పరిత్యజించి యింక లోకమునకుఁ బ్రదర్శింపఁగల మానుష మే మికలదు ? అమానుషము లుత్తమమానుష దివ్యశక్తులని తలంచువారికిఁ బ్రమాదము లేదుగాని మీదృష్టిలో బ్రతిబంధకమే కావున పైనుదాహరింపఁబడిన యమానుషములన్నియు వదలుచోఁ బ్రత్యేకభారతము కావలసియుండును. అట్టిచో మీరు స్వకపోలకల్పనములతో భారతము రచించి లోకమున కొసఁగుఁడు. కవిబ్రహ్మసృష్టిని సంస్కరించుట కేల తొడఁగుదురు? అట్లు కడఁగుట కవిస్వత్వమును భంగపఱచుటయగు. మీసొంతరచనము లోనైనచో మీభావమునకు మీశబ్దము నకు నన్యోన్యసంబంధముగుదిరి మీప్రతిభ బాగుగా వెల్లడియగును. కవిబ్రహ్మ వాక్యములకుఁగల కవిబ్రహ్మభావముల విడిచి మీభావము నంటించి యందు కనుగుణము గాఁ దాఱుమాఱు సేయుట హాస్యాస్పదమేయగును- కవిలక్షణమునకే విరుద్ధము. ఇట్లు వ్రాసితిమని కినియకుందురు గాత- ఆంధ్రావని మోదమందఁగని పారవైచిన భారతమునందు మీకును మాకును హక్కు సమానము గావున నిట్లు వ్రాసితిమి. అతిక్రమయజ్ఞ్వయే యిప్పుడున్నచో నాయనబాధ యాయనయే పడువాఁడు—

# ఆధునికాంధ్రవాఙ్మయమున

# వచనము - విమర్శనము

రచయిత

## చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్, బి. యె.

౧

తెనుఁగువాని గద్యసారస్వతము నకు పదునేనిమిదవ శతాబ్దారంభ మున నే పునాది వేయబడినది పదునైదవశతాబ్దమున కొన్ని గద్య కృతులు తెలుగునాట వెలసినవని కొందరి యభిప్రాయము. ఈయభిప్రాయమును బలపరచుటకు తగిన పరిశోధన మింకను జరుగవలసియున్నది. కళువె వీరరాజు వచనభారతము, పదునేడవశతాబ్దమున వెలువడిన గ్రంథములయందు పేర్కొనదగియున్నది పదునెనిమిదవ శతాబ్దారంభమున చొక్కనాథుడు శ్రీరంగమహాత్మ్యమును వచనము న రచియించెను, సముఖము వేంకటకృష్ణప్ప జైమినిభారతము మొదలగునవి తరువాత వెలువడినవి. మొత్తముమీద ౧౮౧౯ లో ప్రకటింపబడినప్రతి విక్రమార్క కధయే ముద్రణమునందిన తొలి తెనుగు వచనగ్రంథము. ఇప్పటినుండియే తెనుగుగద్యవాఙ్మయము నకు వలయు పుష్టి సమకూరినది.

చిన్నయసూరిగారి నీతిచంద్రిక, శేషాచలకవిగారి నీలగిరియాత్రాచరిత్రము, దశకుమారచరిత్రము మొదలగునవి క్రమముగ తరువాత ప్రకటింపబడెను.

ఈగ్రంథములయందలి శైలికిని, నేటి తెనుగువచనరచనమునకును భేదముకలదు. సంస్కృత సమాసములతోడను, శబ్దాలంకారములతోడను పూర్వగ్రంథములు అలరారుచున్నవి ఈశైలియందు తొలిసారి మార్పునుగొనివచ్చి, నేటి తెనుగుగద్యవాఙ్మయమున కుపకారము గావించిన వారిలో శ్రీ చెదలువాడ సీతారామశాస్త్రిగారు ముఖ్యులు. వీరి దక్కను పూర్వకథలయందు సంస్కృత సమాసములు కానరావు, శైలి సులభముగనుండి తెనుగుభాసయొక్క తియ్యదనమును విశదపరచుచున్నది.

ఆంధ్రవాఙ్మయ మీరీతి కొలది కాలములో సర్వతోముఖముగ నభివృద్ధిగాంచుటకు దోహదము గావించిన మహనీయులలో శ్రీ వీరేశలింగము పంతులుగారి కొకపవిత్రస్థానముకలదు. వీరి నీతిచంద్రిక (ఉత్తరభాగము)యందు క్రొత్తపోకడ లేవియు గోచరింపవు, కాని తరువాత వెలువడిన రాజశేఖరచరిత్ర మొదలగు వీరి వచన గ్రంథములయందు తెనుగుబాసయొక్క కులుకుందనము, తెనుగు నుడికారమునందలి తియ్యదనము, చక్కగా ప్రదర్శింపబడినది.

శ్రీరావిపాటి గురుమూర్తిగారి రచనలు, శ్రీశతఘంటము వేంకటరంగశాస్త్రిలుగారి భాగవత భారత వచన రచనములు గద్యవాఙ్మయమునకు పుష్టిని గూర్చినవి. తరువాత కొన్నివచనగ్రంథములు ప్రచురింపబడినను, మొత్తముమీద ఇరువదవ శతాబ్దారంభమునుండి తెనుగు వచన మన్నివిధముల యభివృద్ధిగాంచుట కవకాశము లేర్పడినవి. విజ్ఞానచంద్రికా గ్రంథమాల స్థాపింపబడి నవలలు, ఇతర శాస్త్రగ్రంథములు ప్రచురింపబడినవి ఆంధ్రపత్రికయందు ప్రకటింపబడిన శ్రీపానుగంటి లక్ష్మీనృసింహముగారి సాక్షియుపన్యాసములు తెనుగు గద్యవాఙ్మయమున నూతనాధ్యాయమును ప్రారంభించినవని యనవచ్చును. తెనుగువారీ యుపన్యాసములను మిగుల శ్రద్ధతో పరించించినారు. కొందరీయుపన్యాసముల శైలి నలవరచుకొనియున్నారు ఆంగ్లవాఙ్మయప్రోద్బలముననే ముఖ్యముగానాంధ్రగద్యవాఙ్మయమునం దీమార్పులు కలిగినవి క్రొత్తగా నెలకొల్పబడిన గ్రంథమాలల వలన పెక్కు బంగాళీ నవలలు తెనుగులోని కనువదింపబడినవి.

ప్రస్తుతము తెనుగువచనము సర్వతోముఖముగ నభివృద్ధిచెందినదని చెప్పుటకు వీలులేదు హిందీ, బంగాళీ మొదలగు భాషలయందు గద్యవాఙ్మయము నేడొక ప్రత్యేకస్థానము నలంకరించుచున్నది, అట్టి గౌరవమునే ఆంధ్ర గద్యవాఙ్మయమును త్వరలో సంపాదించుకొనునని తలంతును. శ్రీ రవీంద్రుని రచనములు మన తెలుగువారికి వచనమునందున్న విలువ నెరుకపరచినవి. ఉపన్యాసములు సహితము పద్యములయందే గావించు నాచారము తొలగిపోయినది వచనము నాధారపరచుకొని లలితములగు భావములను వ్యక్తపరచుట కవకాశము కలదని తెలుగువారు గుర్తింపగలిగిరి. చక్కని వచనరూపకములు, కథలు, కావ్యములు నేడందులకే విరివిగా ప్రచురింపబడుచున్నవి. ఆధునికకాలమున తెనుగు వాఙ్మయమునందు గలిగిన ముఖ్యమగు మార్పులలోనిది యొకటి.

౨

విమర్శనము తొలినుండియు తెనుగువాఙ్మయమున పెంపొందింపబడలేదు. వాఙ్మయాభివృద్ధికి విమర్శనమే మూలకందము. ఆంగ్ల వాఙ్మయ మిట్లు సర్వతోముఖముగ నభివృద్ధిగాంచుట కందు వెలువడిన విమర్శనములే ముఖ్యకారణములు. కవి గ్రంథమును సృష్టింపగలడు గాని, అందలి మంచి చెడుగులను లోకమున కెరిగింపజాలడు. అందులకు విమర్శకుడు పూనుకొనవలయును వాఙ్మయము వన్నెకెక్కవలయుననిన విమర్శనము పలువిధముల నభివృద్ధిచెందవలయును. షేక్స్పియర్ మహాకవి వ్రాసిన నాటకములపై వెలువడిన విమ

ర్శనములు, ఆంగ్లభాష నభివృద్ధి పరచుటయేగాక, వారి నాగరికతాభివృద్ధిని లోకమునకు చాటిచెప్పినవి.

తెలుగువాఙ్మయమున ప్రథమమున విమర్శనము లేదనియే చెప్పవచ్చును. శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు తమపత్రికయగు అముద్రితగ్రంథచింతామణియందు కొన్ని విమర్శకవ్యాసములను ప్రచురించి మార్గదర్శకులైరి కొన్ని శబ్దముల యుత్పత్తిని గూర్చియు, ఆముక్తమాల్యదయొక్క కర్తృత్వనిర్ణయమును గూర్చియు శ్రీ రామకృష్ణయ్యగారు విలువగల విమర్శనములను వెలయించిరి. సమకాలికులు, రచియించిన కొన్నిగ్రంథములనుగూడ వీరు విమర్శించియున్నారు.

శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారి కవులచరిత్రము, శ్రీ గురుజాడ రామమూర్తిపంతులుగారి కవిజీవితములు, తరువాత ప్రచురింపబడెను. కవుల కాలనిర్ణయమునందు, నివాసస్థలములను నిర్ణయించుటయందు శ్రీ వీరేశలింగముగారు మిగుల నేర్పును ప్రకటించి, తమకుగల ఆధారముల మూలమున కొన్ని నూతనవిషయములను చర్చించి, తెనుగువాని విమర్శనాదృష్టిని విశాలమొనరించిరి. ఆలోచన రేపు కొన్నివిషయములకు నిలయమగు వీరి కవులచరిత్ర విమర్శకవాఙ్మయము నభివృద్ధిపరచి, పరిశోధనలు గావింప కొందరకుత్సాహమును గూర్చెను.

కళాప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు శృంగారనైషధమునకును, ఆముక్తమాల్యదకును రచియించిన అవతారికలు, సర్వంకషావ్యాఖ్యలు భాషాభ్యుదయమునకు మిగుల సాయమొనరించినవి. ఇవి తెనుగువాని విమర్శనాకౌశలమునకు నిదర్శనములై యలరుచున్నవి. గీర్వాణాంగ్లేయ విమర్శనాపథముల ననుగమించుచు, శ్రీరామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారము కొన్ని క్రొత్తమార్గముల జూపినది. ఇంతదనుక నొకకావ్యమునుగూర్చి ఇట్టి విమర్శకగ్రంథము ప్రత్యేకముగా తెనుగునాట వెలసియుండలేదు. ఇందు మొదటి రెండు ప్రకరణములు, అమూల్యములగు విషయముల కాకరములు. ఆంధ్రవిమర్శనావాఙ్మయమున కిందు బలమగు పునాదులు వేయబడెననుట అతిశయోక్తి కానేరదు. భావనాశక్తిని గూర్చియు, పాత్రరచనాతత్త్వమును గూర్చియు, శైలినిగూర్చియు ఇందు ప్రస్తరింపబడిన విషయములను నేటి యువకులు పఠించి, అనుకరింపవలయున్నది. మిగిలియున్న కొన్ని కావ్యములనుగూర్చి ఇట్టి విమర్శకగ్రంథములు ప్రకటింపబడిననే గాని విమర్శకవాఙ్మయ మభివృద్ధిచెందినదని తలుప వీలుండదు.

శ్రీరావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారి గ్రంథములు విలువగల విషయములకు నిలయ[illegible] యలరుచున్నవి. బాలకవిశరణ్యమునం దెన్నియో ప్రయోగము లుదాహరణపూర్వకముగ సమర్థింపబడినవి. గద్యచింతామణి మొదలగు నితరగ్రంథములయందు పొందుపరుపబడిన విషయములు శ్రీ పంతులుగారి విమర్శనాకౌశలమును చాటుచున్నవి.

విమర్శనమునం దాసక్తి నేడు విరివిగా గన్పట్టుచున్నది క్రొత్తతీరు విమర్శనములను వెలయించుటకో నాంగ్లవాఙ్మయముసాయమును తెలుగువారు పొందియున్నారు.

ఇంకను విమర్శనము తెనుగువాఙ్మయమున అభివృద్ధి కావలసియున్నది. ఇంతదనుక గల్గిన యభివృద్ధి తృప్తికరముగా లేదు. వ్యక్తిదూషణములతో కొన్నివిమర్శనములు నిండియుండుట శోచనీయము, అనర్హములైన పొగడ్తలతో కొన్నివిమర్శనములు ప్రకటింపబడుటయు కలదు. విషయమునే విడనాడి, తమపాండిత్యప్రకర్షణమునకై కొంద రనవసరములగు విషయములను విమర్శకవ్యాసములందు జొప్పించుటయుకలదు. ఇట్టిపద్ధతులు సత్వర మంతరింపవలయును. వాఙ్మయమున కన్నివిధముల వన్నెగూర్చునదిగా విమర్శనముండిననే గాని అది ప్రయోజనకారి కానేరదు

శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగా రట్టి యుపయుక్తములగు విమర్శనములను వెలయించిన వారిలో నొకరు.

# 'ఆంధ్రుణ్ణయిన నాతడాఖా'

చిన్న కథ

'కాని, అరవ అసెంబ్లీలో — ఆంధ్రస్పీకరుగారి ఇంగ్లాండు ప్రయాణం ఆగిపోయిందని పత్రికలలో చూచినమీదట, నా వెనుకటి కథ జ్ఞాపకంవచ్చి, ఇప్పుడు వ్రాసినా'

రచయిత

## దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

౧

నేను బి, ఎల్ విద్యార్థిని. అయితే, హాస్టలు విద్యార్థులు, తాము చదువుకోక చెడిపోవడమే కాకుండా, నాబోటివాళ్లను చదువనివ్వరు వీరి బాతాఖానీ అయిపోయేంతవరకు, పెందలాడి నిద్రపోదామంటేనా? కబుర్ల రేడియోలు ముక్కువద్ద స్మెల్లింగుసాల్టు పెట్టో, మరేమైన కోతిచేష్టలు చేసో— లేపి, వారి కబుర్ల రేడియో దగ్గరకు చేర్చుకోంది నిద్రపోరు ఇట్లే నిత్యం, వీరు విద్యాగ్నికుండంలో ఆస్తిపాస్తులు హోమంచేసేవారు

నేను హాస్టలుగోష్ఠిలో మునగానాం తేలానాంగా వున్నా, పాట్రాత్రముకొరకు, వీళ్లు నిద్రపోయిన పిమ్మట, చదువుకొనేవాణ్ణి అయితే, పీడర్లపాలిటి మృత్యుదేవత—చట్టం—వచ్చింది దీంట్లో బి ఎల్, పరీక్ష ప్యాసుఅయిన పిమ్మట ప్రతి విద్యార్థి అనుభవజ్ఞుడగు 'వాగుడుకోరు' వద్ద ఒక సంవత్సరం వెట్టిచాకిరి (అప్రెంటిస్) చెయ్యాలని, లేకపోతే 'అడ్వకేటు' అనే సన్నదు చిక్కదని—అన్నీ కలిసి ఏడువందలరూపాయలకు పైగా, హైకోర్టువారికి కట్నం సమర్పిస్తేగాని, 'వాగుడుకోరుపని' (ప్లీడరీ–) చేయడానికి సన్నదు చిక్కదని పత్రికల్లో చదివి, నిలువునా నీరైపోయినా

ఇంతలో, నల్లగౌన్లు తగిలించుకొని, కాఫీహోటళ్ళపాలిటి యముళ్లు—తిని, తిరగడం కళ్లారా చూచా మరిన్నీ వీళ్ళచేతికి ఒక్క కేసు కూడా రాదని, బల్లకట్టి, దర్జాగా కొంతకాలం యముళ్ళలాగ తిరగాలని, మా రేడియోన్యాసు

పోనీ, వీళ్లు తిని తిరిగేకాలంలో నన్నా, మాతృభాషాసేవ చేస్తారేమో? అనుకొందామంటే– దీనికి ఫీజెవరిస్తారు? కాబట్టే, పెళ్ళప్పుడు, ఒకేసారి, పెద్దఫీజిచ్చిన భామా సేవ చేస్తుంటారు కర్మంచాలక ఒక కేసు చేతికిచిక్కేనా! ఆ– అంటే ఫీజు, ఊ– అంటే ఫీజు ఇట్లు ఫీజులు గుంజడమే కాకుండా, నోరువాయిలేని దేశస్తుల కేసును చెడగొట్టో– లేక, అపీలుకోర్టుకు లాగాలనో ఆలోచిస్తూ వుంటారు

ఈ దేశభక్తితో, ఏదైనా ఒక ఉద్యోగం సంపాదించి, దేశసేవ చేయడం మంచిదని నిశ్చయించుకొన్నా అయితే, ఈరోజుల్లో, తల పగలకొట్టుకొన్నా, ఉద్యోగం దొరక్కపోవడం తెలిసేకదా! నేను బి ఎల్, పరీక్షకు చదవను వచ్చింది. మళ్ళా నాకీఉద్యోగం పిచ్చి ఎందుకా? అనిపించింది

అయితే, ఉద్యోగస్థానాల్ని ఆక్రమించుకొన్న తెగలలో, మళయాళీలు బీదవారికి పెట్టుబడి పెట్టి, సిఫార్సులిచ్చయినా, ఉద్యోగాలు యిప్పిస్తారని, వాళ్లు బాకీతీర్చగల స్థితిలోవున్నప్పుడు, పెట్టుబడి రాబట్టుకొంటారన్న కీర్తి గడించారు. కాని, ఈసమపాయం వారిదేశస్థులకేనా? లేక నాబోటి ఆంధ్రుడికీనా? అనే సందేహంకలిగింది

అయితే, కేరళస్త్రీలు కుసుమకోమలులు వారిహృదయం మధురాతిమధురంగా వుంటుంది. దీనికి నిదర్శనంగా మళయాళీస్త్రీలు ఆంధ్రులను వలచిన ఆచూకీలు తీసి, మాహాస్టలు రేడియోలు బ్రాడ్కాస్టుచేసినప్పుడు విన్నా. దీన్ని బట్టి

'ప్రేమకు కులం తెగులు లే'దని సిద్ధాంతం కావించుకొన్నా.

మరిన్ని మళయాళీఉద్యోగస్తులు-నేను పెళ్లిచేసుకొన్న, కేరళస్త్రీని పోషించడానికైనా, ఉద్యోగం నాకిప్పిస్తారని నమ్మకం కుదిరింది. ఇంతకు నేను కళాబ్రహ్మచారిని (బి. ఏ. ని), విశేషించి నారూపు రేఖలను సర్వోసుకమీషక మెచ్చుకొన్నప్పుడు— ప్రేమార్ద్ర హృదయంగల కేరళకాంత నన్ను తప్పక వరిస్తుందని ఆశకలిగింది. కాబట్టి పెళ్లిచేసికొని, ఉద్యోగం సంపాదించవచ్చునని ఉభయతారకంగా ఆలోచించా. అయితే, దీనికి అమ్మ ఒప్పుకొంటుందా? అనే భయం పట్టుకొంది. కాని, ఇంట్లో చాలినంత ధనం లేనప్పుడు, ప్లీడరీ పనికి చదివి ప్రయోజనం లేనప్పుడు ఊరక ఉద్యోగం దొరకనప్పుడు ఆమె ఒప్పుకోక, చేసేదేముందని సమాధానాన్ని బిఱ్ఱబిగించా ఇంకేముంది, తల్లితో చెప్పకుండానే, నేను బి. ఎల్. పరీక్షకు తిలోదకాలివ్వా లనుకొన్నా కాని, ఆంధ్రోద్రేకాన్ని చంపుకొని, కాలేజిచదువుకు ఒకవారం సెలవు చీటి పంపుకొన్నా.

౨

కెనమరా లైబ్రెరీలో, కేరళదేశస్తుల సుస్వభావాదులను పొగిడే-గ్రంథాలేమైనా చిక్కుతవేమో? అనిన్ని, మ్యూజియం దగ్గర కేరళ కన్యలను చూడవచ్చునని ఆలోచించి, దారిబట్టి మెటర్నిటీ ఆసుపత్రిదగ్గరకు వచ్చేటప్పటికి, నేను చూడదలచుకొన్న దేశస్తురాలు రిక్షావాడితో మాట్లాడుతున్నది

ఆమెచేతిలోవున్న ప్రేమస్థాన పరీక్షానాళం (స్టెతస్కోపు) చూచి, లేడీడాక్టరని నిశ్చయించుకొన్నా అయినప్పటికి ఆమె స్థితిగతులు రిక్షావాడికి తెలుసునేమో? అని, వాణ్ణి అడిగి కనుక్కోతలచా. ఇంతలో రిక్షావాడు ఆమెను సాగనంపి, తన బండిదగ్గరకు రాగానే, 'రిక్షా' అని పిలచా, 'రిక్షా, ఓఋం సార్' 'సార్, రిక్షా' అంటూ, బండ్లతో నలుగురైదుగురు వచ్చారుకాని, నేను మాట్లాడ తలచిన వాడి రిక్షా ఎక్కి 'మ్యూజియంకు పో' అన్నాను. రిక్షా పరుగెత్తుచున్నది.

'ఏ, రిక్షా, ఇచ్చట పెండ్లి కాని, లేడీడాక్టర్లెంతమంది వున్నారు?'

'సార్, ఇప్పుడు నాతో మాట్లాడుతున్నామెను మీరు చూచారూ?'

'ఆ,'

'సార్, ఆమెకు ఇంకా పెండ్లి కాలేదు. ఇటువంటివాళ్లు ఇంకా చాలమందిఉన్నారు మీకు పెళ్లిందా?' అన్నాడు నేను విననట్లు ఊరుకొన్నా

'మీకు మంచి అందగత్తెను మాట్లాడిపెడతా—సార్, నాదెబ్బ చూడండి ఇందాక మీరుచూచిన లేడీడాక్టరు స్నేహితురాలు నర్సు ఉన్నది ఆమెతో మాట్లాడమంటారా?'

'సరే,'

ఇంతలో, వాడు రిక్షాను మెటర్నిటీఆసుపత్రిదారికి మళ్ళించి, అచ్చటికి చేర్చినాడు

'మీరిక్కడే, కూర్చోనుండండి, సార్, నే నిప్పుడేవస్తా' నంటూ, ఆసుపత్రి గేటుదగ్గరికిపోయి, జవానుతో మాట్లాడి, లోపలికి వెళ్లాడు

ఇంతలో నేను—కళ్ళద్దాల నీళ్ళలో తేలాడే కలువ రేకులు, చిరునవ్వు తరంగాలు గల లేడీ డాక్టరు ఫోటోను నామనస్సులో చిత్రిస్తున్నా. అట్టె, రిక్షావాడు నన్ను సమీపించి—

'నర్సు ఇక్కడ లేదు సార్' అన్నాడు. అంతట నాభావసమాధిని విడిచి—'ఎక్కడికి పోయింది?'

'ఆమె యెగ్మూరులో ఒకరోగి వద్ద వున్న'దని డాక్టరమ్మగారు చెప్పారు

'అయితే, మ్యూజియంకు పో.'

'మీరు సాయంత్రానికి, ఇక్కడికి వస్తే అన్నిసంగతులు కనుక్కొనివుంటా సార్'

'చూస్తాంలే.' అంటూ రిక్షా దిగి, వాడికి ఒకపావలా ఇవ్వపోతే—

'ఎక్కండి సార్, తమర్ని మ్యూజియంలో విడిచిపెడతాను.' అన్నాడు. నేను మరల రిక్షాయెక్కినాను మ్యూజియంలో బండిదిగి, పావలా

యిచ్చినాను. వాడు సంతోషంతో దణ్ణంపెట్టి—

'నాది నూటపదకొండో నెంబరు రిక్షా సార్' అంటూ, బండిని యీడ్చుకొని వెళ్ళిపోయినాడు నేను కెనమరాలై బ్రేరీకి పోయే దారిలో మ్యూజియందగ్గర-వస్తూ, పోతూవున్న విలాసవతులను పరిశీలిస్తూ నిలబడ్డాను. ఆరోజు మళయాళీ స్త్రీలెవ్వరు కానిపించలేదు. ఇంతలోకి అయిదుగంటలయినది నేను అదరా-బదరా, అస్పత్రిదగ్గరకు నడిచివచ్చినా కాని, రిక్షా వాడి జాడలేదు.

## 3

రిక్షావాడు దారిలో కనబడతాడేమోనని తలంచి, చక్కా నడిచి, యెగ్మూరుస్టేషనుకు చేరుకొన్నా. కాని, అక్కడకూడా వాడిజాడలేదు. అక్కడ నేను మళ్ళీ బస్సెక్కి, ఓవర్ బ్రిడ్జిదగ్గర దిగి, ఆసుపత్రి రోడ్డున- పోతూవుండగా—శ్రీ మునగాల రాజావారి బంగళా సమీపానికి వచ్చేటప్పటికి రిక్షా వాడు నవ్వుతూ, నావద్దకు పరిగెత్తుకొనివచ్చి—

'పోదాం పదండి సార్'

'ఎక్కడికి?'

'యెగ్మూరు ఆరోగికి నెమ్మదిగావుందట అయినా, వాళ్లు నర్సును ఇంకా నాల్గురోజులు వుంచుకొంటారంట మీరు కావలెనంటె, ఆమెచేత వాళ్ళకు, ఏదోఒకటి చెప్పించి, మీతోటి పంపుతా' అన్నాడు.

నేను అనుమానిస్తూ—'ఒకవేళ, వాళ్లు నర్సును నాతోమాట్లాడనివ్వను, రానియ్యకపోతే?

'నర్సు వచ్చేటట్లుచేసేపూచి నాది లేకపోతే, మీజోడుతో కొట్టండి'

'సరే, పోదాం, పా' అని రిక్షా యెక్కపోయినాను

'తొమ్మిదిగంటలమీదట గాని, ఆమె రావటానికి వీలులేదంట, అప్పటికి మీరు వస్తారా?'

'నేను యెగ్మూరు స్టేషనుదగ్గరకువస్తాను. నీవక్కడ నన్ను కలుసుకో.' అని మెల్లగా కదిలాను

రిక్షావాడు నాతోటివస్తూ—'సార్, ఇప్పుడేదైనా పైకం నాచేతికియ్యవలె' అన్నాడు.

నేను ఆలోచిస్తూవున్నా—

'అయితే, నే నేమిచేసేదిసార్, నేను తమర్ని నమ్మినప్పుడు, మీరు నన్ను నమ్మకపోతే,ఎట్లాచెప్పండి?'

'సాయంత్రం ఆసుపత్రిదగ్గరకు రమ్మనమని వచ్చావా?'

'సార్, మీపనిమీద పోయినప్పుడు ఆపని చక్కపెట్టుకొనిరావాలెగదా! మీరే చెప్పండి?ఇంతేకాకుండా—మీరు నన్ను గుర్తించకపోయినా—మిమ్మల్ని నేను పిలిచానా? లేదా? చెప్పండి. ఏమంటారో కాని, ఆసుపత్రికాడ, ఒక పావలా ఖాలియివ్వపోయిన మిమ్మల్ని, రిక్షాలో మ్యూజియందగ్గరకు తీసుకపోతే, అక్కడకూడా మీరు పావలా యిచ్చారు ఇది నాకష్టానికి సరిపోతుందా, చెప్పండి? ఇంత కష్టంచేసినా, మీరు నన్ను నమ్మకపోతే, ఆబంగళావద్దకు పోదాము రండి'

'సరే' అని నేను రిక్షా యెక్కాను. వాడు రిక్షా లాక్కొని ఒక బంగళావద్దకు వచ్చి, ఒకప్రక్కన ప్రహరీగోడవెంబడి దింపినాడు

రిక్షావాడు, యెదుటనున్న ప్రహరీగోడదగ్గరకుపోయాడు, యివతలనిలబడి—'తోటకార్, తోటకార్' అని పిలిచినాడు. జవాబు లేదు. మరల పిలిచినాడు 'ఆ' అంటూ ఒక ఆడమనిషివచ్చింది.

'తోటకార్, ఏడి?'

'మందులషాపుకు పోయినాడు.'

'అయితే, నర్సుదగ్గరికిపోయి, రిక్షావాడు వచ్చివున్నాడని ఆమెతో చెప్పు

'ఇదంతా నాకు తెలియదు. పనుంది పోవాలె' అంటూ పోబోతుంటే—''అమ్మాయి, అమ్మాయి ఇంకేమీలేదు నూటపదకొండో నెంబరు రిక్షావాడువచ్చి కాచుకొని వున్నాడనిచెప్పు నాయంత్రం షికారుపోవాలె, రా'అని అన్నది.'' అని బ్రతిమలాడినాడు

ఆమె విసుగుతో 'సరే' అని లోపలికిపోయి, పావుగంటకు గోడకాడికివచ్చి 'వాడు పైకం యివ్వాలె, తెచ్చినాడో? లేదో? కనుక్కోమంది' అన్నది రిక్షావాడు పరిగెత్తుకొంటూ నాదగ్గరికివచ్చి- 'ఇవ్వాళవస్తానన్న ట్టేను అయిదు రూపాయలు ముందివ్వండిసార్,

కోతిముండ వెళ్ళిపోతుందేమో ?' అని ఆత్రంతో అన్నాడు నర్సు ద్వారా, లేడీడాక్టరు పరిచయం చేసికొనితీరాలనే కుతూహలంతో నోటు తీసియిచ్చినా

రిక్షావాడు నోటు తీసుకొనిపోయి,ఆడదానిచేతి కిస్తూ—'మేము మళ్ళీ తొమ్మిదిగంటలకు వస్తాము. వాకిట్లోవుండు అప్పుడు నీకష్టానికి బాబు ఈనాంయిస్తాడు 'అన్నాడు

'సరే'అన్నది రిక్షావాడువచ్చి-

'భోజనానికి తమర్ని హోటలుకు తీసుకపోయేదా? సార్.'

'వద్దు ఒరే, నీవు బంగళాలోకి పోయి నర్సుతో మాట్లాడలేదేం?'

'సార్, సాయంత్రం ఆమెతో మాట్లాడినప్పుడు 'నీవు మళ్ళీ బంగళాలోకి రావద్దు మనం మళ్ళీ మాట్లాడితే,యింటివాళ్లు అనుమానించి, నన్ను రానివ్వరు. నేను పైకం తెమ్మంటే వస్తానన్నట్లు—రిక్షాపనిలేదుఅంటే, రావడానికి వీల్లేదు అన్నట్లు గుర్తుచెప్పింది' అన్నాడు.

'నేను హాస్టలుకుపోయి భోంచేసి, స్టేషన్దగ్గరికి వస్తా, నీవు అక్కడికిరా

'చిత్తం మీరు నాకష్టానికి సంతోషించాక, బారీ ఈనాం దయచెయ్యాలే ఇప్పుడు నాకూలి యిస్తే, రిక్షా చీటికట్టి వస్తాను లేకపోతే, రాత్రికి రిక్షా నాదగ్గర వుండనివ్వరు!' అన్నాడు నేను వాణ్ణినమ్మి వాడికూలి యివ్వకపోతే, నా అయిదురూపాయలనోటు, నర్సుపరిచయం పోతుందని పర్సు తీసి, దర్జాగా ముప్పాలా వాడిచేతిలోపెట్టినా. వాడు దణ్ణంపెట్టి—

'తమర్ని ఎగ్మూరు బస్సుష్టాండు దగ్గిర వదిలేసి, పోయి, చీటికట్టి వస్తా' అంటూ రిక్షా లాక్కొని వచ్చి, స్టేషన్దగ్గర దింపి 'సరిగా తొమ్మిదిగంటలకు రాండి'అని వెళ్ళిపోయినాడు

## ౪

నేను హాస్టలుకుపోయి, డ్రెస్సు మార్చుకోతలచా కాని, హాస్టలు కోతులు నావెంటబడితే, నాపెండ్లి, ఉద్యోగం పాడవుతుందని, భయపడి, ఏదైనా ఒక హోటలుకు వెళ్ళి రెండుమెతుకులు నోట్లో వేసుకోతలచినా. ఇంతలోకి బస్సు వచ్చింది. దాంట్లో యెక్కిపోయి, వాల్టేక్సురోడ్డు హోటలులో నాల్గుచపాతీలు, పెరుగన్నంతిని, తొమ్మిదిగంటలకు యెగ్మూరుస్టేషను దగ్గర బస్సుదిగినా రిక్షావాని జాడ లేదు ఒకవేళ, వాడు ఆబంగళాదగ్గర కాచుకొని వుంటాడని తలచి, బంగళాకాడికి వచ్చి, పహరాలాయిస్తూన్నాకాని, ఒక్కరూ కాన్పించలే.

ఆదారినపోవు కొత్తవారికి దార్లు చెప్పలేకను—టయం అడుగువారికి గంటలు చెప్పలేకను తంటాలుపడుతున్నా రిక్షవాడుకాని, తోటగాని ఆడదిగాని రాలేదు.

ఇంతలోకి, తెల్లటిచీరె గూడకట్టు అమ్మాయి వస్తున్నది ఈ పిల్లనరుసుగా వుండవచ్చనుకొన్నా. ఆమె నాసమీపాన నిలచోకుండా పోతుంటే, నేను నవ్వుతూ—

'రిక్షావాడు కనిపించాడా?' అన్నా ఆమె ఒకకోరచూపు నామీద పారేసి, తనదారిన తాను పోయింది

'ఆంధ్రుణ్ణనయి నా తడాఖా' లో ఇంకేముంది ! ఆరురూపాయలతో నాపెండ్లి ఉద్యోగం ఆరు-మూడు అయిందనుకొన్నా, దొంగకు తేలుకుట్టినట్లు కేరళకన్యాన్వేషణ మానుకొని, హాస్టలుకు చేరుకొన్నా

కాని, అరవఅసెంబ్లీలో- ఆంధ్రస్పీకరుగారి ఇంగ్లాండుప్రయాణం ఆగిపోయిందని పత్రికల్లో చూచిన మీదట, నావెనుకటికథ జ్ఞాపకంవచ్చి, ఇప్పుడు వ్రాసినా

---

## బహుధాన్య

మ బహుధాన్యాబ్దము, శబ్దమాత్రమనిపింపన్ బోక, సానుగ్రహా
గ్రహతారల్, నిరవగ్రహంబుగ వెలుంగన్, నిండి వార్వాహముల్
ముహురానందసుధాప్రవాహలహరీపూరంబు వర్షింపఁగా
బహుధాన్యంబులతోఁ దెనుంగుఁబొలముల్ బంగారుపండించుతన్

—కవితాకలానిధి, బలిజేపల్లి లక్ష్మీకాంతకవి.

# మణిమాల

## నారాయణదాసు నాగభూషణం

'జనవరినెల 8 వ తేదీని ఆంధ్రపత్రికాముఖమున సంగీతసాహిత్యవేత్తలగు బుద్ధిమంతులను తమకు తోచినరీతిని పరీక్షించి బహూకరింపనెంచి కొన్ని పరీక్షావిషయములను స్వయముగా నిర్ణయించి బ్ర శ్రీ. ఆదిభట్ల నారాయణదాసుగారొక యాహ్వానమును బ్రకటించియుండిరి దానిపై ఫిబ్రెవరి 19 వ తేది కృష్ణాపత్రికలో బ్ర శ్రీ వారి నాగభూషణముగారు ఒక ప్రత్యాఖ్యానమును బ్రకటించిరి. శ్రీనాగభూషణంగారి ప్రత్యాఖ్యానమును జూచి నేనెంతో విచారించినాను. ఓ రింతటి తీవ్రత చెందవలసిన కారణ మేదియును దాసుగారి వ్యాసములో గోచరింపదు. రెండుచేతులతో రెండుతాళములను వేయుచు బల్లవి పాడుట సామాన్యమైన పనికాదు. తిరువయ్యారు సుబ్రహ్మణ్యయ్యరను దాక్షిణాత్య గాయకు డొక డిట్లు పాడుచుండెడివాడు. ఆత డిట్టి సర్కస్ ఫీట్లు కొన్ని చేయుచు దక్షిణదేశమందును, ఆంధ్రదేశమందును జాలమంది విద్వాంసులను భ్రమింపజేయుట నాకెరుక అతడు విజయనగరములో గూడ నిట్టి ప్రజ్ఞాప్రదర్శనము జేసి యచ్చటి విద్వాంసుల నోళ్లు గట్టినాడు అట్టి క్లిష్టసమయమున దాసుగారైదుజాతులను ఏకకాలమందు ఒక్కటే పల్లవియందు నెలకొల్పి పాడిచూపించి పరుషవాక్పరుడును, దురభిమానియునైన యాపండితుని చేతి వీరఘంటామణిని దీసి క్రిందబెట్టుమన్నాడు. ఆదెబ్బతో నయ్యరుగారు రాత్రికిరాత్రి చెప్పకచెయక తోకముడుచుకొని విజయనగరమును విడిచిపోయినాడు దాసుగారి ప్రతిభవలన విజయనగరమునకే కాక ఆంధ్రదేశమునకంతటికిని గూడ మర్యాద దక్కినది- తాళగతుల విషయమున దాసుగారుచేసిన ఈపని యొక పెద్ద 'రిసెర్చివర్కు.' ఇట్టిది పూర్వశాస్త్రప్రోక్తమై యుండుట యసంభవము క్రొత్తక్రొత్తవిషయములను కనిపెట్టుటయేగదా ప్రతిభ యనబడును ఇట్టి ప్రతిభాశాలి తాను చేసిచూపినపని మరెవ్వరైన జేసిచూపినయెడల సంతోషించి స్వంతద్రవ్యముతో విద్వదుచితముగా సంభావింతునని చాటుచున్నాడు ఇందేమి తప్పున్నది? ఇది యిష్టమై కష్టముగా దోచకున్నయెడల దాసుగారి యాహ్వానము నంగీకరించి వెళ్ళవచ్చును- లేదా మానవచ్చును. అంతేకాని ముందువెనుక లాలోచింపక ఆవయోవిజ్ఞానవృద్ధుని విద్యాపక్షపాతములేనివాడనియు, గొంతెమ్మకోరికలు కోరినవాడనియు, అహంకారవిశిష్టుడనియు, పండితంమన్యుడనియు ఇంక నేదేదో నోటికివచ్చినట్లు లసద్వాక్యము లుపయోగించి వ్రాయుటవలన నాగభూషణంగారి లేఖిని సాధులోకములో రట్టువడు నేగాని గిట్టుబడి గడింపజాలదు 'ఏదీ దాసుగారు గద్దెయెక్కి నాబోంట్లవలె నాలుగైదుగంటలు గాత్రగాన మొనర్చిగాని, జంత్రవాదన మొనర్చిగాని, రెండును సమ్మేళన మొనర్చిగాని గానసభ చేయగలరా, చేసియుండిరా, యికముందు చేయదలపెట్టిరా' యని నాగభూషణంగారు డీకొట్టుచున్నారు. వాక్యార్థవివేకులగు సజ్జనులీవ్రాతలనుచూచి పైకిగాకున్నను మనసులోనైన నేవగించుకొనక మానరు. నాగభూషణంగా రెప్పుడో పల్లవిపాడిరట! దాసుగారు తాళము వేయలేక తల్లడిల్లిరట! దాసుగారు గాయకవైణికులను బరీక్షింపనెంచుట హాస్యాస్పదమని నాగభూషణంగారు వ్రాయుట హాస్యాస్పదమగును. 'నిజముగా నట్టి విద్యాసత్కారమొనర్చు బుద్ధితోడనే ఆవ్యాసమును దాసుగారు ప్రకటించియుందురని యేవిమర్శకుడును యెంచలేడు ఆయన చారిత్రమట్టిది' అని నాగభూషణముగారు వ్రాయుట కేవలము తొందరపాటు ఈయాహ్వానము యథార్థమో లేక వంచనమో అనుసందేహము దాసుగారిచ్చిన గడువుదినములు దాటినతర్వాతనుగదా తీరవలెను. అంతవరకును మన మేదియు నిశ్చయింపవచ్చునా? ఎందుకింతతొందర? 'అర్థకామవిముఖుడై జ్ఞానవైరాగ్యములు సంపాదించి తరింపనెంతురుగాత' అని నాగభూషణంగారు దాసుగారి నుద్బోధించుట గ్రుడ్డువెళ్ళి పి[illegible] వెక్కిరించుట!'

—పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రి

* * *

## స్మృతిచిహ్నము

'నాగేశ్వరరావుపంతులుగారి స్వర్గారోహణమును గూర్చి చింతించని పత్రిక లేదు వారి గుణగణములను గూర్చి అభివర్ణింపని కవిలేదు ఆక్రోశమును దెలుపని నాయకుడులేదు వ్రాతనేర్పని వారుకూడ ఈవిషయములో వ్రాయసగాండ్రయిరి. కవిత్వము దానియంతటనదియే వెల్లువయై ప్రవహించుచున్నది వస్తువు యొక్క మహిమ యిది. ఎట్టి అలంకారభూయిష్ఠమైన వర్ణనయైనను నాగేశ్వరరావు పంతులుగారి విషయములో స్వభావోక్తి యగుచున్నది కాని అత్యుక్తియగుట లేదు పూర్వపుకవులు చారుదత్తజీమూతవాహనాదులను గూర్చి వర్ణించినప్పుడు, ఆ వర్ణనలన్నియు అతిశయోక్తు[illegible]

కొనుచుంటిమి కాని నాగేశ్వరరావు పంతులుగారిని గూర్చిన వర్ణనలను జదివిన పిమ్మట కవుల సూక్తులు స్వభావసిద్ధము అని రుజువగుచున్నది పంతులుగారద్యృష్టజాతకులు సజీవులై యున్నప్పుడును, పరమపదించిన పిమ్మటను పంతులుగారు కవులకు వర్ణనీయులగుట గొప్పవిశేషము ఆంధ్రదేశము వారి మరణమునకు విలపించుచున్నది కేవలము ఒక దానకర్ణుడు కీర్తిశేషుడయ్యెననియే కాదు. నమ్మదగిన నాయకుడొక నెక్కడనని దేశము హాహాకారము సలుపుచున్నది. ఇట్టిమహనీయుని దివ్యస్మృతికి ఒక మహత్తరమైన చిహ్నమును నెలకొల్పుట ఆంధ్రులప్రథమకర్తవ్యమనుట నిస్సంశయము పంతులుగారు ఆంధ్రాభ్యుదయమునే తమ స్మారకచిహ్నముగ జేసికొన్నమాట నిజమే అయినను, ఆంధ్రులు తమ కృతజ్ఞతను ఒక స్థూలరూపమున వెల్లడిపరచుకొనుట వారి విధి. ఈ జ్ఞాపకచిహ్నము ఏ రూపమున నుండదగుననను విషయము చర్చించబడుచున్నది. శిలాప్రతిమయని కొందరు, ఆంధ్రభవనముఅని మరికొందరు, పత్రికాశిక్షణాలయమని కొందరు—ఏవేవియో ఎవరికి తోచినవిధమున వారు సలహాల నిచ్చుచున్నారు ప్రతిచోటను చిన్న చిన్న వ్యవస్థలను నెలకొల్పుటకంటె, ఆంధ్రప్రముఖులెల్లరు ఆలోచించి, ఒక స్థానమున ఏదియో యొక పెద్ద స్మారకచిహ్నమును నెలకొల్పుట యవసరము. పంతులుగారి విషయములోనైనను స్థలవిషయమై పిచ్చియభిమానములను బెట్టుకొనక, విశాలహృదయముతో నొక నిర్ణయమునకు వచ్చెదరు గాక!''

—కృష్ణాపత్రిక.

* * *

## కాల్పులకు తేయాకు దివ్యౌషధము.

చలికాలంలోను, ఎండకాలంలోను ఒళ్లుకాలడంవల్ల ప్రమాదాలు యెక్కువగా ఉంటాయి. చలిమంటలవల్ల చలికాలంలోను-- ఇల్లూ, వళ్లూకాలే అగ్నిప్రమాదాలవల్ల ఎండకాలంలోను ఈ ప్రమాదాలు యెక్కువగా జరుగుతాయి ఇక యితరసమయాల్లో సంభవించే కాలుడుప్రమాదాలు సరేసరి ఆస్పత్రులు ఉన్న ఊళ్లోనైతే వెంటనే అక్కడకువెళ్లి చికిత్సచేయించుకుంటారు. వైద్యసహాయంలేని పల్లెటూళ్లలోనైతే ఒళ్ళుకాలినవాళ్ళ అవస్థ ఆభగవంతునకే యెఱుక. ఎవరికైనను ఒళ్ళుకాలినప్పుడు దగ్గరనున్నవాళ్ళకు, సమయానికి యేమీ తోచక, మంటలార్పుటకైగాని, చల్లగా ఉండునని గాని చన్నీళ్ళుచల్లడం, ఏమన్నా మసో, పసరో పూయడం తటస్థిస్తుంది అందువల్ల యింకా ఒళ్లు మంటలెత్తి, బొబ్బలుపొక్కి, చీముపట్టి శరీరమంతా విషపూరితమై దుర్భరమైనబాధతో రోగి చివరకు మరణించడం సంభవిస్తుంది.

ఇంతవరకు వైద్యానుభవంలో కాల్పులకు 'టానిక్ ఆసిడ్' చికిత్స చాలా గుణకరంగా ఉంటున్నసంగతి వైద్యవరులందరు ఎరిగినదే. ఈచికిత్సతో కేవలం నిప్పుకాలుడువల్లకలిగే మరణాలు 100 కి 40 నుండి 4 వరకును, మసలకాగిన నీళ్ళు, నూనెవగైరా కాల్పులవల్ల కలిగేమరణాలు 100 కి 20 నుండి 1 వరకును తగినట్లు అనుభవంవల్ల కనబడుచున్నది 'ఈ టానిక్ ఆసిడ్' చికిత్స కుశలులగు వైద్యులు చేయతగినదేగాని అందరును చేయతగి అందుబాటులో నుండునదికాదు కాబట్టి జనసామాన్యమున కిది నిష్ప్రయోజనము

'టీ' అనబడు తేయాకును అందరు ఎఱుగుదురు. తేయాకు పానీయము నేటి నాగరకులందరు త్రాగునదేగాదా! ఈ రోజులలో ప్రతిపల్లెయందును తేయాకు చిన్న చిన్న పొట్లములుగాకూడా చౌకధరకు విక్రయింపబడుచున్నది ఇది పానీయముగాకాక ఔషధముగాకూడ ఉపయోగము కలదగుటచేత ప్రతి ఇంటియందును ఉండతగినది ఏవిధమగు కాల్పులకైనను ఇది పరమౌషధము శరీరము కాలినరోగికి ప్రథమచికిత్సగా దీనిని ఉపయోగింపవచ్చును రోగిని గాలిలేనిస్థలమున పరుండబెట్టి వెంటనే ఈ క్రిందివిధముగా తేయాకునీటిని తయారుచేయుటకు ప్రారంభింపవలెను. సుమారు ఆరు కప్పులు సలసలకాగిన ఉడుకునీటిలో ఆరు చెమ్చాల తేయాకును వేసి పదినిమిషములుండనిచ్చిన మంచికషాయము తయారగును పరిశుభ్రమైన మెత్తని చేతిరుమాలును నాల్గుమడతలుగా మడచి ఆకషాయము వేడి ఆరులోగా కాలిన శరీరప్రదేశమునగల బొబ్బలను కత్తెరతోగాని, సూదితోగాని చితిపి, అందుండు కొనునీటినంతయు కార్చి, కమిలి ముడతలు పడియున్న చర్మమునుగూడ కత్తిరించి పుండంతయు శుభ్రముగ నుండునట్లుచేసి, తేనీటిలో ముంచియుంచిన చేతిరుమాలును మడతలు విప్పి పుండుమీద కప్పి, ఆరగ ఆరగ కప్పినగుడ్డమీద తేనీటిని పోయుచుండవలెను. రోగికి సత్తువకలుగుటకై టీనిగాని, కాఫీనిగాని త్రాగించవచ్చును ఇట్లు ప్రతిదినము కషాయమును పైని జెప్పినవిధముగ తయారుచేసి పుండుమీద వేయుచుండినచో సామాన్యముగా పుండు కొద్దిరోజులకే మానిపోవును.

కొబ్బరినూనె, సిరా, మసి, పసర్లు-ఇటువంటి వేవియు వేయనక్కరలేకయే, దీనివల్ల నయమగునని రూఢిగా జెప్పవచ్చును తేయాకులో చమురు, టానిక్ ఆసిడ్, కాఫిన్ ఈ మొదలగు ద్రవ్యభాగములు ఎక్కువగా నుండుటచేత కాలిన పుండుమీద వేసినచో పూతపూసినట్లు సన్నని చర్మపుపొరలను ఏర్పడునట్లుచేసి, నొప్పినికూడ తెలియనీక, పుండును శుభ్రపరిచి త్వరలో మానునట్లు చేయగలదు.

—ఆంధ్రవారపత్రిక

-డాక్టరు వేటూరి శంకరశాస్త్రి.

జిజ్ఞాస మీమాంస

విజ్ఞానసంపాదనావసరమున వివిధవిషయములందు కలుగు సందేహములను నివారించుకొను ప్రతికాముఖమున జిజ్ఞాస సలుపుటకును—ఇందలి ఏ ఒక్క జిజ్ఞాసకైనను సరే సరియైన సమాధానము తెలిసియున్నచో దానిని కూడినంత సంగ్రహముగ వ్రాసి, ప్రచురణార్థము పంపుటకును ఆంధ్రభూమి పాఠకులను ప్రార్థింతుము —సంపాదకుడు

## ౧౨౨. సరస్వతి ఎవరు?

ఈమె సృష్టికర్తయగు బ్రహ్మదేవుని భార్యఅని లోకంలో ప్రసిద్ధి దీనికి అనుకూలంగా గౌతమధర్మసూత్రభాష్యంలో 'దృష్టోధర్మవ్యతిక్రమః, సాహసంచ మహతాం' అనే సూత్రవ్యాఖ్యానావసరంలో మస్కరి పరివ్రాజకుడు 'యథా ప్రజాపతేర్దుహితృపరిణయాదిః' అని వ్రాశాడు దానిని పెద్ద లిట్లా వివరించారు, ఒకసారి బ్రహ్మదేవుడు సర్వాంగసుందరియైన ఒక కన్యను సృజించాట్ట ఆమెను చూచునప్పటి కాయనకే మనస్సున మోహ ముదయించింది ఆమెను పెండ్లియాడుట కుద్యమించాడు. అంతట బ్రహ్మ మానసపుత్రులు నారదుడు, దక్షుడు మొదలైనవాళ్లు నీకు పుత్రిక, మాకు చెల్లెలు అయిన యీమెనెట్లా పెండ్లి చేసుకుంటావు నీబోటి పెద్దలే ఇట్లాజేస్తే ఎట్లాగన్నారుట అంతట ఆయ నో ఉపాయం పన్నాడు ఏమిటంటే తా నీశరీరం మారితే యీదోషపరిహారం అవుతుంది అని అంతట అల్లే కామరూపుడు గాబట్టి ఆదేహంమార్చి యింకోదేహం తాల్చి ఆమెను పెండ్లాడాడు దేహంమార్పి చేసుకున్నా యీపనిని శిష్టులు గర్హిస్తూనే ఉన్నారు. అందువల్ల ఆ అకృత్యం ఎట్లా ధర్మమూలంకాదో అట్లాగే ఇతర వేదవిదుల అకృత్యాలుగూడా ధర్మమూలాలుకావు' అని, అక్కడి ప్రకృతసంబంధం అనుకోండి ఇక్కడి ప్రకృతాన్ననుసరించుదాము అయితే సరే బాగున్నది సరస్వతి బ్రహ్మభార్య అను

## ౧౧౬. బ్రహ్మకు ఆలయం

దీనికి సంబంధించిన చిన్న వివరము. బ్రహ్మకు గుంటూరుజిల్లా చేబ్రోలులో దేవాలయముకలదు. దానిని రాజా వాసిరెడ్డి వేంకటాద్రి నాయుడుగారు కట్టించిరి.

—తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

బ్రహ్మకు ఆలయము ఉత్తర హిందూస్థానములో అజమీరుకు సమీపమున పెష్కర్‌రాజ్ లేక బ్రహ్మపుష్కరనీ అను గ్రామములో మాత్రమే యున్నట్టు యీనెల ఆంధ్రభూమిలో వ్రాయగా చూచినాను మన ఆంధ్రదేశములోని గుంటూరు జిల్లాలోని చేబ్రోలు గ్రామమున బ్రహ్మగుడి గలదు. చేబ్రోలు చరిత్ర ప్రసిద్ధమైన ప్రాచీననగరము.

—కనుపర్తి వరలక్ష్మమ్మ.

## ౧౧౭ సత్యనారాయణ వ్రతం

ఆంధ్రదేశములో సత్యనారాయణవ్రతము చేయదలచిన ఎవరి ఇళ్లల్లో వారే చేసికొంటారు ఇతరులఇళ్ళకి వెళ్లి ఆచరించే ఆచారములేదు. నైజాంలో చేస్తారంటే అది వారి ఆచారంకాబోలు. దూరమైన యూరోపియన్ ఆచారాలు అవలంబించుచున్న మనవాళ్ళకి, దగ్గరున్న నైజాం ఆచారాలు ఎందు కలవడలేదో!

—యం రామక్రిష్ణయ్య

## ౧౧౮ యూరప్‌లోని దేశాలు

యూరప్‌లోని దేశాలన్నీ మొత్తం 33. అందు 17 రాచరికంలోవున్నవి 16 ప్రజాసత్తాకములై యున్నవి

రాజప్రభుత్వములు

1 ఆల్బేనియా
2 బెల్జియమ్
3. బల్గేరియా
4 డెన్మార్కు
5. హంగిరీ (రీజెన్సీ)
6 ఐస్‌లాండ్
7 ఇటలీ (ఫాసిస్టుడిక్టేటర్‌షిప్)
8 లీచ్ టెన్‌స్టీన్
9 లక్జెంబర్గు
10 మొనాకో
11. నెథర్‌లెండ్సు
12 నార్వే
13. రొమేనియా (మొనార్కిస్టు డిక్టేటర్‌షిప్)
14 స్వీడన్

షుందాము. అను[illegible] కు ప్రామాణికుడైన కాళి[illegible] తో విరోధంవస్తున్నదే ఈక్రింది పద్య శకలం తిలకించండి, 'యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవైస్సదా పూజితా, సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా' బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు మొదలగు దేవతలచే పూజింపబడు భగవతి యగు సరస్వతి నన్ను రక్షించు గాక యని అయితే ఆయనకు భార్యే అయితే ఆయన ఆమెను పూజించడ మెట్లా తటస్థిస్తుంది? అట్లాచేయడం లోక విరుద్ధం, మన్వాదిధర్మశాస్త్రవిరుద్ధం కూడాను కావున ఈభార్యాభర్తృత్వకల్పనం అయుక్తంగా తోస్తున్నది కాళిదాసవాక్యంలో అప్రామాణ్యజ్ఞానం కల్పించుకోవడయూ యుక్తంగాదు కాబట్టి యీవిషయంలో పెద్దలు ఏమి చెపుతారు?

—అవ్వారి వాసుదేవశాస్త్రి.

౧౨3. ఆంధ్ర దేశంలో మహమ్మదీయులు.

మహమ్మదీయులు ఆంధ్రదేశములో నెచ్చటెచ్చట ఎక్కువగా అనగా నూటికి 95 వంతులు ఉన్నారు? కొండవీడు, కొండపల్లి మొదలైన పర్వత ప్రదేశములందు వారే యుండుటకు కారణ మేమి? ఇప్పు డచట హిందువులు ఏల లేరు?

—మ. రామకృష్ణ

౧౨౪. బహుమతుల్లో 116

పెండ్లిండ్లయందును, తదితర కార్యములయందును బహుమతులకు రు 116 లకు లేక 1116 లకు ప్రాముఖ్యము ఇచ్చుటకు కారణ మున్నదా?

—గౌరావఝుల వెంకటసుబ్బరామయ్య.

15. యుగోస్లావియా (మొనార్కిస్టు డిక్టేటర్‌షిప్)
16 గ్రేట్ బ్రిటన్
17. గ్రీస్

ప్రజాసత్తాక ప్రభుత్వములు

18. యాండొర్రా
19 జెకోస్లావాకియా
20. డాన్జింగు (నాజిగవర్నమెంటు)
21 ఇస్తోనియా
22. ఫిన్‌లాండ్
23. ఫ్రాంస్
24. జర్మనీ (నాజీడిక్టేటర్‌షిప్—ఇటీవల ఆస్ట్రియా ఇందు చేరింది)
25. లాట్వియా
26. లిథూనియా
27 పోలెండు (సెమిడిక్టేటర్‌షిప్)
28 పోర్చుగల్
29. శాన్‌మారినో
30 స్పెయిన్
31. స్విడ్జర్‌లాండు
32 టర్కీ (సెమిడిక్టేటర్‌షిప్)
33. సోవియట్‌రష్యా (కమ్యూనిస్టు)

౧౧౯. రష్యాభోగట్టా

యు యస్ యస్. ఆర్ అంటే యూనియన్ ఆఫ్ సోషలిస్ట్ సోవియట్ రిపబ్లిక్సు యూరప్‌ఖండం దాని పరిసారాల్లోవున్న ద్వీపాలు కలిసిన వైశాల్యం 4,400,000 చతురపుమైళ్లు. 1930 లో జనాభా 506,000,000 మంది. 4,400 000 చతురపుమైళ్ళ వైశాల్యం గల ప్రదేశంలోను యు యస్ యస్. లర్ ప్రదేశమే సగానికి పైగా వున్నది. ఇదిగాక యు. యస్. యస్. ఆర్‌కు ఆసియాఖండంలో కూడా విశాలప్రదేశం వుంది. ఈరెండు ప్రదేశాలు కలిసిన దాని వైశాల్యం మిగిలిన యూరపియన్ దేశాల అన్నిటివైశాల్యంకంటె దాదాపు నాలుగురెట్లు వుంది. యూరప్‌లోని జనాభాలో నాలుగోవంతు యు. యస్. యస్. ఆర్‌లో నివసిస్తూవున్నారు. ఆసియాఖండంలోవున్న యు యస్ యస్. ఆర్ భాగంలోని జనాభా కూడా దీనికి కలిపితే జర్మనీ, ఫ్రాన్సు ఇటలీదేశాల జనాభాకంటె పదమూడు మిలియనులు అధికంగావుంటుంది జనాభానిబట్టి చూస్తే యు యస్. యస్ ఆర్ ప్రపంచంలో మూడవరాజ్యం మొదటి రెండును చీనా, ఇండియాలు యు.యస్. యస్ ఆర్ అమెరికాసంయుక్తరాష్ట్రాలకంటె నలభై మిలియనుల హెచ్చు జనాభాను, మూడురెట్ల భూప్రదేశాన్ని కలిగివున్నది ప్రపంచంయొక్క భూప్రదేశం ఆరుభాగాల్లో ఒకభాగపు భూప్రదేశాన్నన్నీ, ప్రపంచయొక్క జనాభా పండ్రెండు భాగాల్లో ఒకభాగం జనాభానీ యు యస్ యస్ ఆర్ కలిగివున్నది

౧౧౨ ఆంధ్ర దేశంలో హైడ్రో ఎలక్ట్రిక్ స్టేషన్

ఆంధ్రదేశంలో నీటిశక్తివల్ల విద్యుశ్ఛక్తిని ఉత్పత్తి చేయుటకు అవకాశములు ఉన్నప్పటికిని ఆంధ్రులు నోరులేనివారు కావటంచేత ఆ అవకాశాల్ని ఉపయోగించుకొని వృద్ధిలోకి రెచ్చుకోలేకపోతున్నారు ఆంధ్రదేశంలో నేటివరకు నిర్మించిన ఎలక్ట్రిక్‌స్టేషన్‌లు అన్నీ బొగ్గుమీద ఆధారపడినవే. బొగ్గుమీద ఆధారపడడం ఎప్పటికేనా ప్రమాదకరమైందే ఆంధ్రదేశంలో విశాఖపట్టణం ఏజెన్సీలో లమ్మసింగి హైడ్రోఎలక్ట్రిక్ స్టేషన్‌కు అనుకూలమైంది ఒరిస్సావాళ్ళు లాగుకొనిపోయిన తెలుగుగడ్డలో హైడ్రోఎలక్ట్రిక్ స్టేషన్‌లు పెట్టుకోతగిన జలపాతాలు మూడువున్నాయి

—కొత్తపల్లి రామమూర్తి, యల్. యమ్. ఇ.

# భార్య వయోధిక ఐతే మంచిది

ముసలి మొగుడు – పడుచు పెళ్లాం అయితే వున్నకష్టం
పడుచు మొగుడు – ముసలి పెళ్లాం అయితే ఏమాత్రంవుండదు.

మనల్ని పరిపాలించే పాశ్చాత్యులీ రహస్యాన్ని గుర్తించారు
పెళ్లాంపెద్దదైతే వేపుకుతినడం తప్పిపోతుంది
చిన్న పెళ్లాలతో సంసారాలు నడిపేవారికి చిత్తశాంతి వుండదు

రచయిత

## కొత్తపల్లి రామమూర్తి, యల్.యమ్.ఇ.

ప్రకృతి సర్వజీవరాసులకు సమానధర్మములనే కల్పించింది. కాని పురుషుడు, సృష్టికి తలకట్టని గర్వించి యితర జీవరాసులలో లేని కొన్ని ధర్మములను, నియమములను తాను కల్పించి తలక్రిందై స్వయంకృతాపరాధి అవుతున్నాడు. తనవలెనే మానవజాతికి చెందిన స్త్రీని తనతోబాటు నడవనీయక నిరంకుశాధికారియై సంఘములో సర్వాధికారము చలాయించుచు స్వలాభియైనాడు — మొండిబలమే దీనికి కారణం—లేకపోతే ఏమిటి చెప్పండి స్త్రీపురుషసంబంధంలో ఏయితర జంతుసంఘంలోను లేని వయసుభేదం ఒక్క మానవజాతిలోనే ఎందుకు కలగాలి?

పురుషుడు చిన్నపిల్లను చేసుకొని కులుకుచు కాలంగడిపి వయసు ముదురవటంవల్ల ముగ్గినపండులా ముందే రాలి మృత్యుముఖంలో మునిగిపోతున్నాడు అందుతో అతని స్త్రీ అనాథ అవుతోంది. ఆస్త్రీ బహుసంతానంతో బాధా సముద్రంలో దారి తెలియక తన్నుకుంటూ దుఃఖము పాలౌతోంది.

పురుషుడు చిన్నపిల్లను చేసుకుంటూవున్నట్టే స్త్రీకూడా ఎందుకు కుర్రవాణ్ణి – అనగా తనకంటె చిన్నవాణ్ణి- పెళ్ళిచేసుకోకూడదు? మగాడు పెద్దపిల్లను చేబట్టితే ఆయువు క్షీణమవుతుందని స్వార్థపరులైన పెద్దన్నయ్యలు ధర్మశాస్త్రాలలో స్పష్టంగా వ్రాసిపెట్టేరు దీనికి అర్థం ఇంకోలా తీస్తే పెద్దమొగడుగల సాధ్వికి దీర్ఘాయువు కలుగుతుందనే కాదండి మరి ఏమిధర్మమండి! కాముకులయిన రసికుల కిది హితవుగా ఉంటుంది, వారికి అనుకూలమైంది కాబట్టి కాని స్త్రీజాతికిది పైకి చెప్పరాని- తేవులులేని- వేదనను పుట్టించేవిషయం.

మొద్దుముండావాళ్లుగనక పురుషులు ఇంతకాలంనుంచీ కోమలహృదయులగు కొమ్మలను దుమ్ముచేస్తున్నారు నేను వీరనారులు విచ్చల[redacted]రు గనుక యి[redacted] యిక సాగవని చెప్పగల[redacted] ఇకమీద స్త్రీపురుషసంబంధాలలో వయస్సు అడ్డురాకూడదు.

చెరుకువిలుకాని చేష్టలుచేసే పక్షిమిథునములో చిన్నా పెద్దా భేదం కనిపించదు బలిష్ఠంగా, వీర్యవంతంగావున్న మగపక్షీ ఆడపక్షితో పెద్దా చిన్నా భేదంలేకండా కాపరం కానిస్తూవుండడం మనం నిత్యం చూస్తూనేవున్నాం.

పోనీ ఈరెక్కలజంతువుల సంగతి వదిలేద్దాం మనలాగే రెక్కలులేని పశువులను చూడండి వానిలోను స్త్రీపురుషసంయోగంలో యీవయసు వ్యత్యాసం ఉన్నట్టు గోచరించదు. అచ్చుబోసిన కొత్తఆంబోతు ఎంత ముసలావునేనా దాటుతుంది. చిత్తకార్తిలో కుక్కలు ఈవయోవ్యత్యాసం బొత్తిగా గమనించవు ఎవరన్నా గమనిస్తాయని అంటే వారు పిచ్చిఆసుపత్రికి పంపతగ్గవారై వుంటారు

ప్రకృతిలో లేని ఈనియమం మానవసంఘంలోమాత్రం ఎందుకు కలగాలి?

భార్య పెద్దదైతే సంతానానికి లోపమా? ఒకపువ్వు కాయగా మారుటకు పుప్పొడి ముఖ్యంగాని అది ముందుపూసిన పువ్వుదా తరువాతపూసిన పువ్వుదా అనేభేదం ఉన్నట్లు వైజ్ఞానికులు కూడా గుర్తించలేదు కాబట్టి సంతానమునకు శుక్రము, శోణితమే అవసరం గాని వాటిని ఇచ్చేవారి వయోవ్య

త్యాసం అవసరంకానివిషయం.

ప్రకృతివల్ల పుట్టి ప్రకృతిలోపెరిగి, ప్రకృతిలోనే కలసిపోయే ఈ మానవుడు ఇట్టి ధర్మం త్రోసిరాజని ప్రకృతి కతీతంగా పరుగిడబోయి పల్టీలు కొడుతున్నాడు

రసపిచ్చగాళ్లు ఎవరన్నా పడుచుభర్త ముసలిభార్యను ముద్దుపెట్టుకుంటే ఏంరమ్యంగా వుంటుందనవచ్చు- కాదండి మరి పూసేపూసేపువ్వు,ఊరేఊరేవూరగాయిమీద వున్నమోజు పూర్తిగా పూసిన పుష్పంమీద, బాగాఊరిన పాత ఊరగాయిమీద వుండదు.

మల్లి, జాజి, మాలతీ మొగ్గలు విప్పారకుండానే పుణికివేస్తారెందుకే? ఊరీవూరని ఊరగాయ తిననేర్చిన ఈ రసపిచ్చగాళ్ళకు బాగా ఊరిన ఊరగాయ రుచి ఏమి తెలుస్తుంది? దుక్కెద్దుకు పంచదార అటుకుల పస తెలిస్తేగా వీరందరు కృష్ణునికన్నా గొప్పవాళ్ళా?

వయోధిక అయిన భార్యలో ఏంవిశేషం లేకపోతేనే మనకు భగవద్గీత చెప్పి ఆదర్శపురుషుడయిన కృష్ణుడు చిన్నచిన్నగుంటలు వేనకువేలు వేపుకుతింటూవున్నా అందరినీఅవతల కనిపి అత్తగారైన రాధతో సరసాలు చలాయించాడూ? పెద్దదానితోపోతే ఆయువు క్షీణిస్తుందనే ధర్మశాస్త్రవచనమే నిజమైతే శ్రీకృష్ణుడు ఇల్లాంటిపని ఎందుకుచేస్తాడు? శాస్త్రిలు ఏంపని చేయలేదక్కడ.

ఇంతకీ పైపెచ్చు అత్తనంటితే ఆయువృద్ధి అవుతుందని శ్రీకృష్ణుడు రూలింగుకూడా యిచ్చినట్టు పుస్తకాలు తిరగేస్తే తప్పకుండా కనుపిస్తుంది.

ఎన్నివిధాల ప్రసిద్ధిచెందినా పెద్దముండను చేపట్టినందుకే వాని పేరు మరీ ప్రసిద్ధి చెందింది రుక్మిణీ సత్యలపేర్లు చేర్చడానికి వీలులేని వానిపేరుతో రాధపేరు బంకనక్కిరికాయలా పట్టుకుపోయినట్టు చాలాచోట్ల కనబడుతోంది రాధాకృష్ణుల ప్రణయగాథల కంతేలేదు. కవుల కలాలకు బాగా పనిచెప్పిన ఈ నాయికానాయకుల్లో నాయకునికంటే నాయిక చాలా పెద్దది.

పదిమందిలో ఒక ముసలిదానితో పోయాడంటే అనవచ్చు కృష్ణుడువిషయంలో కాని ఏకపత్నీవ్రతుడని ఖ్యాతిగాంచిన రాముడు సీతకన్నా చిన్నవాడేగా అంచేతనే వాడు ఏకపత్నీవ్రతుడైయాడు అంచేతనే సీతకి భయపడి శ్రీరాముడు పిల్లిలా ఊరుకున్నట్టు తోస్తుంది లేకపోతే రాజపుత్రునకేకపత్నీవ్రతం ఎక్కడ? ఇంకోవిషయం పెళ్లాందగ్గిరభయంలేని వాడైతే ప్రజలలో అవమానం కలిగిందని ఆమెను అడవులకు పంపాలని తలచికూడా నిజంచెప్పక 'నీవు ఋషికన్యలను చూడకోరిక కలదని చెప్పావు వెళ్ళిరమ్మని' దొంగమాట లెందు కాడాలి—చిన్నివాడు కనుక—సీతపెద్దది కదా సంతానంఏమైనా లోపంకలిగిందా అంటే తండ్రిని తలదన్నిన తనయులు పుట్టేరు.

చంద్రుడు శీతకరుడై [illegible]నికి ప్రియుడైనాడు అంద[illegible] అందగాళ్ళకు మరిని

ప్రతీవానికి ప్రియుడై శీతకరుడు ప్రతీవానికి ఆదర్శపురుషుడైయాడు ఆ ఆదర్శపురుషుడు గురువుగారికే పెట్టేడు పంగనామం. గురువుభార్య అయిన తారవల్లో కులుకుతో కూచునేవాడట చదువుకునే రోజుల్లో. చదువుపూర్తి అయ్యేసరికి సరాగాలు మొదులుపెట్టాడు పువ్వుబోడితో బుద్ధిమంతుడై తారకు బుద్ధిమంతుడైన బుధుని పట్టించాడు చిన్నవాడైన తండ్రికి పెద్దదయిన తల్లికిపుట్టినపిల్లడు గమకనే అంతబుద్ధి బుధునికి.

పోకిరీలలోకల్లా పోకిరీ దేవేంద్రుడు — సహస్రయోనిగాడు— వాడువచ్చి చంద్రుని బెదిరించడం, కోడలికి బుద్ధిచెప్పి అత్తఏదో చేసిందన్నట్టు. పెద్దపెళ్లాని చేబట్టినవానికి బలం మిక్కుటంకాబట్టి తనకంటే పెద్దదైన తారను చేబట్టిన చంద్రుడు బలాధికుడై ఒక్కడే అయినా దేవతలందరినీ డొక్కబ్రద్దలకొట్టి చెత్తరేగ్గొట్టి పంపాడు.

ధర్మంఎక్కడో జయంఅక్కడ చంద్రుడు జయించాడు కాబట్టి చంద్రుడిదే ధర్మపక్షం అనగా వయోధికలైన స్త్రీలను పెళ్లాడ్డమే ధర్మం అని సారాంశం

అయిదుగురిని పెళ్లిచేసికొన్న ద్రౌపదిమాత్రం చిన్నదా? పెద్దదని నిరూపించటానికి తగిన వ్రాతమూ

...పోయినా నిరాధారంగానే ...ద్దాం—గాలిలోనిదీపం— ...నా ప్రజ్ఞ - పోతేపోతుంది

...ద్రౌపది అయోనిజ పుట్టేటప్పు ... పెద్దమనిషిట భీష్ముడి తాతయ్యమీద పగతీర్చుకోడానికి పుట్టిన శిఖండి ఆమెకు తమ్ముడు పాండవ సైన్యాధిపతియైన దృష్టద్యుమ్నుడూ ఆమె సోదరుడే పరీక్షలవల్ల కాకుండా అనుభవంవల్ల ఉగ్యోగాలు యిచ్చేరోజులవి దృష్టద్యుమ్నుడు బ్రాహ్మణ్ణి చంపటానికి పుట్టాడు బాణంతోసహా వాడు సైన్యాధికారైనాడంటే చాలా పెద్దఅయివుండాలి. అంచేత వాని కన్నా పెద్దదైన ఆమె పెద్దదైయ్యే ఉండాలి. అదీగాక యంత్రాన్ని ఎవరుకొడితే వారినే పెళ్లిఆడతానందిగాని చిన్నవాడు కొడితే చేసుకోనని లేదు కాబట్టి ఆమెవారి కన్నాకూడా అవ్వగారే అనావుండాలి ఒకవేళ ధర్మరాజాదులకంటె చిన్నదైనా నకులసహదేవుల కన్నా పెద్దదైయ్యేవుండాలి లేకపోతే వారడవులకు పోతుంటే సహదేవు నెందు కింత జాగ్రత్తగా ఆమెకు వప్పజెప్పాలి అత్తగారు? పెద్దవాళ్లకు చిన్నవాళ్లను వప్పజెప్పుతారుగాని చిన్నవాళ్లకు పెద్దవాళ్ళను వప్పజెప్పరు కనుక్కోండి ఏతాతయ్యనేనా ఆవిషయం పెద్దపెళ్లాం కాబట్టేవారు తిప్పలుపడ్డారంటారేమో! ఆమెమూలాన్నే వారు ఆఖరునన్నా అందనా లెక్కారు లేకుంటే అడ్డుకు తినవలసిందేఅడవుల్లో

ఇవన్నీ వట్టి పుక్కిటిపురాణాలు ఇందులో సత్యం సున్న అనవచ్చు కాని మనల్ని పరిపాలించే పాశ్చాత్యులు అనుసరింపదగిన ఈసదాచారాన్ని పాటిస్తూవున్నారు

కవిశేఖరుడైన షేక్స్పియరు రత్నాల్లాంటి అనేక పాత్రల్ని సృష్టించాడు అట్టి విద్యావంతునికి చిన్నపిల్ల దొరక్కంటూరా తనకన్న ఎనిమిదేళ్ళ పెద్దపెళ్ళాన్ని చేసుకున్నది? పెళ్ళాం పెద్దదైతే వేపుకు తింటం తిక్కవై వ్యవధిబోలెడుండటంవల్ల షేక్స్పియరు మెరికల్లాంటి నాటకాలు విరజిమ్మేసాడు నాటికి నేటికి సాటిలేని నాటకాలు అవి చిన్నపెళ్లాంఐతే చిక్కులుపడేవాడేమో మనకి మల్లే- ఇన్నినాటకాలు వ్రాయలేకపోయేవాడేమో!

జాన్సన్ కవిపుంగవుడికీ ఇదే పిచ్చి అతనికన్నా పెళ్ళాం ఇరవైఏళ్లు పెద్దది డిజ్రాలి బ్రిటిష్ ప్రధానమంత్రుల్లో మీనుమిగిలినవాడు. వాడు కోరివుంటే కోటిమంది కుర్రపిల్లలు వచ్చి పెళ్లాడేవారే కాని అతగానికి భార్య పెద్దదిగా వుండడంవల్ల కలిగే లాభాలు పూర్తిగా తెలుసును కనుకనే పెద్దభార్యను పెళ్ళిచేసుకున్నాడు

వెతికితే ఎన్నన్నా దొరుకుతాయి కాని చిన్నపెళ్లాలతో సంసారాలు నడిపేవారికి చిత్తశాంతి ఎక్కడ్స? వెతకడానికి ఓపిక అసలే వుండదు రాగాపోగా భార్య పెద్దదిగా ఉండడంవల్ల దేశంలో ప్రబలిపోతున్న జననాలు తగ్గుతాయని, జాతిని దుర్భరస్థితికి లాగుతున్న వ్యభిచారం నిర్మూలం అవుతుందని నాఅభిప్రాయం.

ఏమంటారా భార్య పెద్దదైతే మొగుడు ఆమెచేతిలోని కీలుబొమ్మ అవుతాడు ఈవేళ వేరేమంచం.. అంటే మగాడు పోవలసిందే ఇంకోమంచంమీదికి కుమలికుమలి ఏడుస్తూ అయినాసరే. వ్యభిచారం ప్రబలిపోయిందనీ, ఆడవాళ్ళ స్వాతంత్ర్యపిపాసే దానికి కారణమనీ వాగేవాళ్లు మగాళ్ళే కాని మగాడులేకుండా వ్యభిచారం ఎట్లా జరుగుతుంది. ఈరోజుల్లో దేని మొగుడన్నాఎక్కడకైనాపోతేమొత్తుకోవలసిందే కాని వేరు గత్యంతరం లేదు. భార్య పెద్దదైతే రెండు మొట్టికాయలు మొట్టి మూలకూచోబెడుతుంది- ఇప్పుడు ముసలిమొగుడు పడుచుపెళ్ళాన్ని చేస్తున్నట్టు ఇప్పుడు మగాడుచేసే మొండితనమంతా అప్పుడు ఆడది చేయవచ్చు

స్త్రీస్వాతంత్ర్యమును, అధికారమును కోరే నవీనయుగంలో ఇట్టి మార్పుకలగడం అత్యావసరము. పెండ్లికానిపడతులు తగిన ఆందోళనచేసి కాంగ్రెసు గవర్నమెంటు వుండగనే 'ఇకముందు వధూవరులలో వధువు పెద్దదిగాను, వరుడు చిన్నవాడుగాను (వయస్సులో) వుండునట్లు' ఒకచట్టమును ప్రవేశపెట్టించి అది వెంటనే అమలులోకి వచ్చునట్లు చేయుట స్త్రీసంఘమునకు శ్రేయోదాయకము.

౧

అజితాదేవి రాజపుత్రిక. నారాయణరాజుగారి ఆస్థానకవి ఆవిడని యెన్నడూ చూడలేదు తాను రచించిన గీతాల్ని రాజుగారికి వినిపించేసమయంలో మాత్రం, హాలుపై అంతస్థులమీద పరదా వెనుకనున్న ఘోషాస్త్రీలకి కూడా వినిపించేటట్లుగా, కవి తనకంఠాన్ని హెచ్చుస్థాయిలో మేళవింప జేసేవాడు అతడు తనజీవితాన్ని నడుపగలతార ప్రకాశించే ఆ తారాపథం దాకా తన పాటని విసరివేశేవాడు.

పరదా వెనుక యేదో నీడ కదలుతూన్నట్లు లీలగా అతనికి గోచరించేది. ఏదో కంకణక్వాణ మాతని చెవిని బడేది దూరాన్నుంచే! అది ఆవ్యక్తి కదలుటచే గలిగిన అందెలరవళిగా ఆత డూహించుకునేవాడు. ఓహో! అది కరకురానేలమీద ఆమె నడచుటచే గలిగిన సుకుమారమైన ఆమె పాదముల సవ్వడిగాబోలు! భగవంతుని కృపారసం పాపాత్ముల పైనబడి వారికి సాయుజ్యాన్ని అనుగ్రహించినట్లే మన కవియొక్క మానసికభావాల్ని ఉత్కృష్టస్థితికి తెస్తూండేది! కవి వాటిని తనహృదయపీఠాన్ని నెలకొల్పాడు ఆ అందెలరవళితో మేళవింపజేస్తూ తన కవిత్వాన్ని సాగించాడు. పరదా వెనుక కదలాడే నీడవిషయములోగాని, తన హృదయసంచలనాన్ని అనుకరిస్తూ గానంచేసే ఆ అందెలరవళి విషయములోగాని అతని కెట్టి సందేహమునూ యెన్నడూ కలుగనేలేదు.

రాజకుమారి దాసియైన మంజరి కవియింటిమీదుగానే నదికి వెళ్ళి వస్తూయుండేది ఆమె అతనితో ముచ్చటించకుండా ఒక్కరోజైనా ఉండేదికాదు. సాయంత్రమప్పుడు, రోడ్డు నిర్మానుష్యంగా ఉన్న సమయంలో మంజరి కవిగృహం ప్రవేశించి, అతను కూర్చునియున్న తివాసీమీదనే యొకమూల చతికిలబడి సంభాషించేది

౨

దాసీధరించే ముసుగు విషయంలోనూ, ముడుచుకునే పువ్వులవిషయంలోను యెవరో చాలా శ్రద్ధ తీసికొంటున్నారని పుకారుపుట్టింది. వారిని చూచినప్పుడు జనం యేదో గుసగుసలాడుకోడం మొదలెట్టారు, చిరునవ్వు నవ్వుకుంటూ. కాని మంజరితో సంభాషించడముచేత తానుపొందే ఆనందాన్ని ఇతరులవద్ద వెలిబుచ్చకుండా కవి ఉండకపోడంచేత, వారివిషయములో ప్రజల ప్రవర్తనను యెంతమాత్రమును గణ్యించవలసిన పనిలేదు

ఆమె నామధేయంలోనే, 'పుష్పసంచయం' అనే అర్థం స్ఫురిస్తూంది అసలు నిజానికి, మానవునికి కావలసినంత భావం దానిలోనే ఉందనడానికి యెంతమాత్రం సందేహం లేదు అయినా కవిశేఖరుడు, మరికొంత మాధుర్యాన్ని దాంతో గుచ్చెత్తి 'వసంతపుష్పసంచయం' అని పిలవడం ప్రారంభించాడు

మానవులంతా 'యిదేమిటని' నోళ్లు నొక్కుకున్నారు

అతడు, తన వసంతఋతువర్ణనలో ఆవిడని కీర్తించుతూ వసంతపుష్పసంచయాన్ని గురించి అదేపనిగా గానంచేస్తూంటే, ప్రభువు తన్మయుడై నిమీలితనేత్రుడవడం చూచి దానికి సమాధానంగా, ఒక చిరునవ్వు పారేశేవాడు మనకవి

'వసంతుని ఆస్థానములో జన్మని సంగీతము పాడడమేనా తుమ్మెదయొక్కపని' అని ప్రభువు ప్రశ్నించేవాడు

'అంతేకాదు వసంతపుష్పసంచయములోని మధురరసాస్వాదనము గూడా' నని కవిసమాధానమిచ్చేవాడు రాజసభంతా నవ్వేవారు

కవిఇచ్చిన నామధేయాన్ని స్వీకరించినందులకు, అజితకుమారి తన

# దూరాన్నుంచి చి

## పరదా వెనుక నీడ

'మృత్యుముఖము
రాజు పగలుచేసిన తప్పను

దా

ధరించే ముసుగ
ముడుచుకునే పువ్వ
ఎవరో చాలా శ్రద్ధతీసుకుం

ఈ చిన్నికథకు
రావులపర్తి సూర్య

దాసీత్వమున మంజరిని జూచి నవ్వింది అని పుకారుపుట్టింది మంజరిమాత్రం మనస్సులోనే అపరిమితానందం చెందింది

ఈవిధంగా నిజానిజములు ఏకమైపోతాయి భగవంతుని సృష్టిలో భగవంతుని సృష్టికి అలంకారము సమకూరుస్తాడు మానవుడు

3

కవిచే గానముచేయబడిన దంతా పరిపూర్ణమైన సత్యస్వరూపమే ఆదిమధ్యాంతరహితులైన రాధాకృష్ణులే స్త్రీపురుషులు సృష్ట్యాదినుంచీచస్తూవున్న దుఃఖము, అనంతమైన ఆనందము, వీని సమ్మిశ్రితమైన జీవనపథము- ఇవే అతని గీతములలో యిమిడిఉన్న భావాలు ఆకవి రచించిన గీతాలు, కడుపు కక్కురితిచేత వీధులలో అడుక్కుతినే ముష్టివానిదగ్గరనుంచి, దేశమునంతకును ఏకచ్ఛత్రాధిపతియై సింహాసన మధిష్టించియున్న మహారాజు వరకు ప్రతివారి నాలుకమీదా తాండవించేవి తద్భావము ప్రతీవారికి అనుభవైక్యవేద్యము అందుచేత, లేతవెన్నెలలుగాసే శరత్తులోనూ, వేడిగాడ్పుల కాకరమైన వేసంగిలోనూకూడా, అతని గీతాలు వివిధ ప్రదేశాల్లోనుంచి వివిధకంఠాలతో మార్మోగేవి

ఆవిధంగా, సౌఖ్యంగా దొర్లిపోతున్నాయి రోజులు కవి తన గీతాల్ని రాజసభలో వినిపించేవాడు. ప్రభువుతోపాటుగా సభికులంతా, ఆగీతాల్ని విని ఆనందంతో ఉప్పొంగిపోయేవారు మంజరి కవి యింటికి వస్తూ పోతూండేది పరదా వెనుక నీడ లీలగా గోచరించేది బంగారు చిరుఘంటల చప్పుడు దూరాన్నుంచే వినబడేది.

౪

అప్పుడు దక్షిణదేశమునుంచి దిగ్విజయ యాత్రమీద బయల్దేరాడో కవిపుంగవుడు అతడు అమరాపురరాజ్యానికి కూడా వచ్చి నారాయణప్రభువునికూడా దర్శించాడు. ఆకవి తానంతవరకు ప్రవేశించిన ప్రతి ఆ స్థానములోనూ దిగ్విజయాన్ని పొందుతూ వస్తూయున్నాడు ప్రభుసింహాసన పార్శ్వమున నిలువబడి, ప్రభువును స్తుతిస్తూ ఒక పద్యంచెప్పాడు ప్రభువు అతనిని అతిథిసత్కారములచేత పూజించి చాలా గౌరవ[illegible]చేశాడు అప్పుడు పుండరీకకవి 'ప్రభూ! నాకు వాదభిక్ష కావాలి' అని కోరాడు.

ఆస్థానకవియైన [illegible]రునికి ఆ కవితావాదం యేవిధముగా పరిణమించునో తెలియుటలేదు అతనికా రాత్రంతా నిద్ర పట్టనేలేదు. పుండరీకుని సమున్నతదేహము, గర్వము ఉట్టిపడేటట్లుగా ఒక వైపునకు తిరిగిఉన్న అతని శిరస్సు, సన్నని పొడుగైన అతని నాసిక, యివన్నీ ఆరాత్రి, అతని కళ్ళముందు తాండవించాయి అతిదౌర్బల్యహృదయంతో శేఖరుడు మరుదినము ఉదయాన్నే రాజాస్థానమునకు చేరాడు సభారంగమంతా జనంతోటి క్రిక్కిరిసిపోయింది. ఆస్థానకవి తలవంచుకునే, తనప్రతికక్షికి, ఒక చిరునవ్వుతో అభివాదనము చేశాడు పుండరీకుడు దానిని ఒక చిన్న శిరస్చాలనముచే గ్రహించి, తన అనుచరుల వైపు భావయుక్తంగా ఒక చిరునవ్వును పారేశాడు

శేఖరుడు ఘోషాస్త్రీలున్న అంతస్థువైపు తన చూడ్కి నిగిడించి, తనప్రేయసికి మనస్సులోనే అభివాదనముచేసి 'ఈరోజు కవితావాదమున నేను జయమునుగాంచితినా, నీవిజయనామమును కీర్తించుతాను' అని అనుకున్నాడు.

అంతట్లో ఢంకానినాదము ప్రభువురాకను సూచించింది సభికులంతా నిలువబడి 'ప్రభువునకు జ

ఘంటలచప్పుడు

లగా గోచరించేది.

విజయకిరీటము '

ప్రతి రాత్రి సవరించింది.

దయంలోనూ,

హృదయంలోనూ

న్నారని పుకారుపుట్టింది

నువాదకర్త

నారాయణమూర్తి

యమగుగాక' అని జయజయ ధ్వానముచేశారు రాజోచితచిహ్నములతో గూడిన తెల్లనిదుస్తులను ధరించి, శరత్కాలమందలి మేఘరాజువలె, నారాయణప్రభువు సభాస్థలాన్ని ప్రవేశించి సింహాసన మధిష్ఠించాడు

పుండరీకుడు నిలువబడ్డాడు సభాస్థలం నిశ్శబ్దతవహించింది. పుండరీకుడు, గర్వం ఉట్టిపడేటట్లుగా, తలపైకెత్తి తనయొక్క గంభీరగాత్రంతో నారాయణప్రభుని కీర్తించాడు సముద్రాన్ని అల్లకల్లోలం చేసే కెరటాలవలె అతని శబ్దాలు, వినువారి గుండె లదరిపోయేటట్లుగా నాలుగు గోడలమధ్యా ప్రతిధ్వనింపాయి 'నారాయణ' అనే పదానికి వివిధార్థములు వచ్చేటట్లుగా, అతడు సమన్వయం చేయడము చూచిన్నీ, అందలి వివిధాక్షరములను వివిధములుగా పద్యములో యిమిడ్చి అతడు అల్లిన అల్లికనుజూచిన్నీ సభికులు ఆశ్చర్యస్వాంతుల య్యారు. వారి ఉచ్ఛ్వాసనిశ్వాసలుకూడా బడిపోయాయి

పుండరీకుడు తన ఆసనముమీద కూర్చున్నతరువాత కొన్నినిముషాలవరకు, అతని గంభీరగాత్రం ఆసభా స్తంభములలోనుంచిన్నీ నిశ్చేష్టులైయున్న సభికుల హృదయాంతరాళములలోనుంచిన్నీ కూడా ప్రతిధ్వనించింది సభయందలి విద్వాంసులు చేతులెత్తి 'బాగుబాగు'న్నారు

ప్రభువు శేఖరునివైపు తనదృష్టి సారించాడు అందుకు సమాధానంగా, శేఖరుడు భారయుతమైన తన నేత్రాల్ని ఒక్కమూహూర్తమాత్రం పైకెత్తి భీతహరిణమువలె లేచి నిలబడ్డాడు అతని ముఖము వెలవెలబోతూంది అతని సిగ్గు స్త్రీ ననుకరిస్తూంది కడుసున్నితమైన, అతని నవయౌవనశరీరము, ముట్టుకున్నంతమాత్రముచేత, సుమధుర గానామృతమును వర్షించడానికి శ్రుతిజేయబడిన విపంచి ననుగమించుతున్నది కవిశేఖరుడు ప్రారంభించాడు శిరస్సువంగింది గాత్రం తగ్గుస్థాయిలో పలుకుతూంది మొదట కొన్నిపద్యాలు సభికులకు శ్రుతములుగాలేవు క్రమంగా శిరము పైకెత్తాడు గాత్రం షడ్జమంలో పలుకుతూంది. సువిస్పష్టమై అగ్నిజ్వాలవలె ఆకాశమంటింది

శేఖరుడు, నారాయణప్రభు వంశమందలి అనాదిసిద్ధములైన వీరత్వమును వర్ణించుతూ, ఆవంశపు పూర్వగాథ నంతటిని, ప్రభుముఖమందు తన నిశ్చలదృష్టిని నెలకొల్పి, కీర్తించాడు అప్పటి ఆసభస్థితి, ప్రజాబాహుళ్యమునకు, తమ ప్రభువంశమందున్న అపారమును, భావాతీతమును, నిశ్చలమును, నిష్కళంకమును అగు ప్రేమ శేఖరుని గీతమం దిమిడియున్న మాధుర్యమువలె ప్రభువుమీద ఉప్పొంగి వెల్లివిరిసిపోతూన్నట్లుంది ఆఖరికి రుద్ధమును, గద్గదికమునైన స్వరముతో, 'నాప్రభూ! శబ్దప్రయోగములో నేను ఒకవేళ జయింపబడవచ్చును కాని ప్రభువంశమందు నాకున్న నిష్కళంకప్రేమలో మాత్రముగాదు' అని పలికి శేఖరుడు తన స్థానములో చతికిలబడినాడు

శ్రోతల నేత్రము లశ్రుపూరితములయినవి సభలోనుంచి బయల్దేరిన 'జయజయ' ధ్వానములచే, రాతిగోడలుకూడా ఊగిపోయినాయి అటువంటి ప్రజోద్రేకానికి, పుండరీకుడు నిర్లక్ష్యముగ ఒకసారి శిరస్చాలనముచేసి, లేచి నిలువబడి, విషపు చిరునవ్వుతో 'శబ్దాతీతమైనది పృథ్వియందేమియున్న' దని తన కంచుగొంతుకతో ఖంగున ప్రశ్నించాడు సభంతానిశ్శబ్ధము అయిపోయినది. తరువాత తన పాండిత్యప్రకర్ష కొరకు, ఆదిని శబ్దమే కలదనీ, శబ్దమే పరమాత్మస్వరూపమనిన్నీ, వేదాల్లోనుంచికూడా ప్రమాణాలని చూపిస్తూ భూలోకస్వర్గలోకాల కంతటికీ యెత్తైన పీఠాన్ని నిర్మించి, శబ్దాన్ని దానిపై అధిష్ఠింపజేసి 'శబ్దాతీతమైన దేమున్నద' నే' ప్రశ్ననే మరల ప్రశ్నించాడు గర్వము ఉట్టిపడేట్లుగా చుట్టుకలయజూచాడు ఆతనిని యెదురుకొనుటకు ఎవ్వరు సాహసించలేరు. తనకెరయైన ఆహారమును కడుపునిండా భుజించి విశ్రమించిన సింహమువలె మెల్లగా కూర్చున్నాడు పండితులంతా 'జేజే' లొనర్చారు ప్రభువు ఆశ్చర్యస్వాంతుడయ్యాడు అంతటి అపారవిద్యాపారంగతునివద్ద తానెందుకూ కొరగానని శేఖరుడు మనస్సులో అనుకొనినాడు

ఆరోజు కంతటితో సభముగిసింది.

*

మర్నాటిసభ. శేఖరుని గీతాగానముతో ప్రారంభమైనది. బృందావనమునందు, ప్రేమమురళిని మేళవించుటచే దానిలోనుండి వెలువడిన సుమధురధ్వనులు వాయువిలీనములగుటకు అదే ప్రథమము ఆమురళీగాన మొనర్చు మహానుభావు డెవ్వడో గోపిక లెరుగరు ఆ మధురధ్వనులు యేదిక్కునుండి వెలువడుచున్నవో వారికి గ్రాహ్యముగుట లేదు కొంతసేపు వాయుపథములోనుండి వెలువడునట్లును, మరొకప్పుడు పర్వతాగ్రములతో వియ్యమందే మేఘమండలమును చించుకొని వెలువడునట్లును అనేక రీతులుగా వినవస్తూంది ఇదమిద్ధమని నిర్ణయించుటకు యెంతమాత్రం వీలులేకుండాఉంది. అస్తమయసమయము, భానుమండలమునుంచి శోకసూచకమగు నిట్టూర్పుగా వినవచ్చింది నక్షత్రములే, సుస్వప్నసమన్వితమైన రాత్రియనెడి విపంచిపైనుండెడి స్థాయిలు ఆగీతానినదము వివిధప్రదేశముల నుండి ఒక్కసారిగా చించుకుని వెలువడుచున్నట్లు గోచరించింది అందిమిడియున్న భావము మాత్రము వారికి విస్పష్టముగాలేదు కాని వారి మానసికావేశమును మాత్రము రగుల్కొల్పుతూన్నది పోనీ తమ మానసిక పరివర్తనమును బహిర్గతము గావించుటకు తగినంత భాష వారికి లేదు. వారి కండ్లు నీళ్లుగ్రమ్మాయి. ఈ ఐహిక జీవనపథానికి అడ్డుతగిలే మృత్యుదేవత వారికి దూరమవుచున్నట్లు తోచింది

శేఖరుడు తాను సభారంగమున నిలబడియున్నాననెడి సంగతిని మరచిపోయినాడు తన సామర్థ్యమును తన ప్రతికక్షితో సరిపోల్చుకొన చూచుకొనునవసరము లేకపోయినది వేసంగియందు, సుడిగాలిలో తిరుగులాడే యెండుటాకులవలె, తనమనస్సు నావరించుకొని సుళ్లుతిరిగే భావములచే నావరింపబడి నిశ్చలుడై తన్మయుడై మురళీగీతమును గానముచేయుచున్నాడు ఇంతవరకును, లీలగా గోచరించే నీడ, వ్యక్తిరూపముతో తనదెస నడచుటచే గలిగిన చిరుగంటల చప్పుడు మాత్రము, అతనికప్పుడు వినబడుతూంది

కొంతసేపటికి, శేఖరుడు ఉపవిష్టుడయ్యాడు సభికులు, వర్ణనాతీతమును, భావాతీతమునైన ఆనందసముద్రములో మునిగియుండుటచేత, జయధ్వానము చేయుచు, తమ ఆనందాన్నికూడా వెలిబుచ్చగలిగిన స్థితికన్న ఉత్కృష్టస్థితిలో తన్మయులై యుండిపోయారు చాలాసేపటివరకును

ఆ భావస్థితి నశించిపోయిన తరువాత పుండరీకుడు లేచి నిలువబడి 'ఆప్రియు డెవ్వడు? ప్రియురా లెవతె?' అని ప్రశ్నించాడు అతిగర్వంగా నలుదిక్కులు పరికించి, తన అనుచరులవైపు ఓవిషపువవ్వుబరపి 'ప్రియుడగు, మురళీనాథు డెవ్వరు? ప్రియురాలగు రాధయెవరు?' అని తిరిగి ప్రశ్నించాడు ఆటుతరువాత, అతడు, ఆమాటలయొక్క వ్యుత్పత్త్యర్థాల్ని చెప్పి, వివిధార్థములను, వివిధభావములను ఆమాటలకు అన్వయించడము మొదలుపెట్టాడు. అందిమిడియున్న ప్రతి అక్షరానికి అన్వయము చెప్పుచూ, సభికులను అయోమయప్రపంచములోనికి తీసికొనిపోయి వారెన్నడు ఊహించియైనా యుండని ఒక అర్థాన్ని వాళ్ళమీద విసరివేశాడు

పండితబృందము బ్రహ్మానందము జెందింది. పండితులు 'జయజయ' ధ్వానము చేసేసరికి సభికులు యీ వన్మంది పిచ్చిగా వారి ననుకరించారు వారు భ్రాంతిలోపడిపోయి, పండితుల ననుకరించారేగాని, వారి పుండరీకుడు చెప్పినదానిని తెలిసికొని మాత్రముగాదు వారి కథంతా ఒక స్వప్నపథంగా గోచరించింది వారి కండ్లముందరనే పుండరీకుని వాక్పారుష్యముచేత సత్యస్వరూపము నాశనమైపోయినది

అతని ప్రదర్శనానికి ప్రభుపు మనస్సు సంతోషంతో ఉప్పొంగిపోయినది సంగీతపుభ్రమ, పాండిత్యమనే వాయువుచే ఎగరగొట్టబడినది ప్రకృతియొక్క చూపు ఆకుపచ్చనైన పచ్చికబయళ్లయొక్క కోమలత్వాన్ని వీడి, యెత్తైన కటికి రాచేలలపై పడిపోయిందా అనిపించింది.

శబ్దప్రపంచములో అడుగడుక్కూ కూడా కష్టపరంపరని యెదుర్కొనుచూ, అంతటి సునాయాసముగా దాటిపోతూన్న పుండరీకుని ముందు, తమ కవి సామాన్యశాలకునిగా కనుపించాడు సభాసదులకి శేఖరుని గీతములలో పటిమ గోచరించలేదు వారికి నూతనత్వము ఏమీ కనపడలేదు అవి వారికి ఏమంత ఉపయోగకరములుగా తోచలేదు.

ఆఖరుసారి ప్రయత్నము చేయమని తన కవిని తీక్షణ వీక్షణముల ద్వారా హెచ్చరించాడు ప్రభువు, కాని కవిశేఖరుడు దానిని గమనించలేదు కుర్చీకి అంటిపెట్టుకుని కూర్చుండిపోయాడు ప్రభువుకోపముతో తన సింహాసనమునుండి లేచి తన మెడలోని 'ముత్యాలహారాన్ని తీసి, పుండరీకుని కంఠసీమయందుంచాడు సభలోని యావన్మంది సంతసించారు

పై అంతస్థుమీదనుంచి వినిపించిన మణిభూషణాదుల గలగల ధ్వని వ్యక్తియొక్క కదలికను సూచించింది, శేఖరుడు లేచి సభను వీడి తలవంచుకుని వెళ్ళిపోయాడు

౬

అది అతిభీకర కాళరాత్రి శేఖరుడు తన రచనల నన్నిటిని తీసి బల్లమీద కుప్పగాపోశాడు వానిలో తాను చాలాకాలక్రితము రచించుటచే మరచిపోయినవికూడా కొన్ని ఉన్నవి పుటలు తిరుగవేస్తూ అక్కడక్కడ కొన్నికొన్ని ఘట్టములను చదువుకున్నాడు అవన్నీకూడా, నిరర్థకములైనవిగాను, చిన్నతనపు చేష్టలుగాను కనుపించిన వాటనికి ఒకదాని తరువాత నొకటిగా, వానినన్నిటిని చిన్నచిన్న ముక్కముక్కలుగాచించి, నిప్పుముట్టించి, ప్రజ్వలింపజేసి లేచినిలచి ఒక్క నమస్కారముచేసి 'ఓఅగ్నిహోత్రుడా' నాయొక్క విజ్ఞానమును నీ పాలు చేస్తున్నాను. ఇన్ని సంవత్సరములనుండియు, నీవు నాహృదయములో ప్రజ్వరిల్లుచున్నావు నాజీవితము బంగారు సదృశమై యుండిన యెడల, అది నీస్పర్శచే మరియు కాంతివంతమయ్యేది. కాని, అది తొక్కిపారేసిన వట్టిచెత్త అందుచేత ఒక్కదోశెడు బుగ్గిమాత్రము మిగులుతుంది. అంతే!' అన్నాడు. అతని కన్నులు చెమర్చాయి.

రాత్రి గడిచిపోతూంది శేఖరుడు కిటికీతలుపులన్నీ బాగా తెరచినాడు తానుప్రేమించే, మల్లె, జాజి వగైరాపుష్పములను, తన ప్రక్కమీద వెదజల్లాడు. తనయింట్లోఉన్న దీపముల నన్నింటిని ఆగదిలో వెలిగించాడు తరువాత, తేనెలో కొంచెము విషరసాన్ని కలుపుకుని దరహసితవదనముతో లోపలికి తీసికొని, తనప్రక్కమీద విశ్రమించాడు.

వీధిగుమ్మందగ్గర బంగారు కంకణధ్వని వినిపించింది మలయానిలముతోపాటు, అవ్యక్తమైన సువాసన గదిలోనికి ప్రవేశించినది

కవి కండ్లుమూసికొనియే 'నాప్రేయసీ! ఆఖరికి [illegible]నిమీద జాలివహించి వచ్చావా!' అన్నాడు

'నాకవీ వచ్చాను'అని సుమధురస్వరంతో సమాధానమువచ్చింది శేఖరుడు కండ్లువిచ్చి తనశయ్యావద్ద ఒక స్త్రీవ్యక్తిని గమనించాడు

అతనికండ్లు మరల చెమర్చాయి తాను యింతవరకు ప్రతిమారూపముగా, తన మానసిక పూజాపీఠముమీద అధిష్ఠింపజేసి పూజించుచున్న, నీడ, తన అంత్యకాలమున కృపావీక్షణమును బరపుటకు, ఈబయటి ప్రపంచములోనికి వ్యక్తిస్వరూపముతో వచ్చినట్లుగా అతనికి గోచరించినది.

'నేను అజితాకుమారిని' అని అవ్యక్తి చెప్పినది. కవి అతికష్టముమీదలేచి తనప్రక్కమీద కూర్చున్నాడు.

'ఈరోజు సభలో ప్రభువు నీకు న్యాయము ప్రసాదించలేదు నాకవీ! వాగ్వాదనమునందు నిజమునకు నీవే విజయమును గావించితివి అందుచేత, విజయకిరీటమును నీ శిరస్సున అలంకరింపజేయుటకు వచ్చితిని' అని అతనిచెవిలో చెప్పింది

ఆమె తనకంఠములోని పుష్పహారాన్ని తీసి, కవికంఠమున అలంకరించినది

౭

కవి తన్మయుడై కండ్లుమూసుకున్నాడు

—రవీంద్రుడు.

# లోకసత్యాలు

## ౧ దొంగపెళ్ళి

'ఏమండీ! గుర్రాజుగారూ! మీ అబ్బాయి పెళ్ళటగా ?'

'ఎక్కడ లేదండీ! యింకా సంబంధం కుదర లేదు '

'తిప్పరాజువారి సంబంధం నిశ్చయమైందనీ వచ్చే దశమినాడు లగ్నమనీ విన్నాను!'

' మొదట అనుకున్నాంగాని, చిన్న ఆటంకంవచ్చింది అయినా మీకు తెలియకండా జరుగుతుందా వివాహం?'

'ఆఁ! అవి పూర్వపురోజుల్లో, ఈబిల్లొచ్చిపడ్డదీ '

'పడటవేవిటి యిప్పు డింకా బిగించారు ఉచ్చు '

' అదే చెప్తున్నా యిహ దొంగపెళ్ళిళ్లు లెక్క లేవు—ఉపనయినాలనీ, సత్యనారాయణవ్రతాలనీ, పురిటిసీళ్ళనీ మొన్నచూశారుగా మన ప్లీడరుగారి చిన్నమ్మాయిపెళ్ళి అంతా గప్‌చిప్! పొరుగింటివాళ్ళకుకూడా తెలీదు!'

'అహఁ! ఆపిల్లకు పదహారేళ్లొస్తేనేగానీ [illegible]ళ్ళిచెయ్యమన్నారు!'

'అందరితోనూ చెప్పటం అల్లాగే—కాని ఉద్దేశంమాత్రం వేరు.'

'ఆయన రిఫార్మరే!'

'అంతా రిఫార్మర్లే—స్వంతవిషయం మినహాయించి! కాని ఒహ చిత్రంకూడా ?'

'ఏంజరిగిందేవిటి?'

'గతదశమినాడు రాత్రి లగ్నం నిశ్చయించారు. శుభలేఖల్లేవు సరికదా నలుగురు బంధువులకూ ఉత్తరాలన్నా రాయకుండా ముఖ్యమైనవాళ్ళను చాటుగా పిలిపించారు.'

'ఉత్తరాలురాస్తేనేం మునిగిపోయిందీ! ఇంత బాదస్తుడా, యీయన!'

'సరే, వచ్చినవాళ్లు వచ్చారు. ఇహ లగ్నంనాడు సాయంత్రం దీపాలుపెట్టగానే కావలసినవారి న[illegible]ర్నీ యింట్లోకి పిలిపించి గేట్లన్నీ మూయించి, తెల్లవారేవరకూ తాళాలు తీయకూడదన్నారు!'

'ఎందుకూ? సంభావన బ్రాహ్మలకు భయపడా?'

' అందుకూ కావచ్చు అంతకంటే ముఖ్యమైంది యితరులకు తెలిస్తే కేసుపెడతారని—పిల్లకు పదేళ్లేగా మరి! అందుకో ఎదటింటి డాక్టరుకీ యీయనకూ మొన్న ఎలక్షన్లలో కొంచెం చెడింది'

'మరి బాజాచప్పుడుతో నైనా తెలీదు ప్రక్కింటివాళ్ళకు?'

'బాజా లేవిటి! బ్రాహ్మణ్ణి కూడా మంత్రాలు గట్టిగా చదవనివ్వందే—యింకా బాజా లేవిటి'

'శెబాష్! ప్లీడరనిపించాడు!'

'కొసాకీ వినండి, ఏంవనిపిస్తాదో! శరవేగంతో జరిగిపోతోంది వివాహకాండంతా. అప్పుడొచ్చాడు ఒకబంధువు రైలుదిగి, రాత్రి పదిగంటలకు. వచ్చి, గేట్లు వేసిఉండటం చూసి తట్టాడు. అందరూ గప్‌చిప్, [illegible]రోధులు వచ్చారని ప్లీడరుగారి ఆజ్ఞ ప్రకార[illegible] తలుపుమాత్రం ఎ[illegible] తెరవలేదు. కాసేపు ఆగి మళ్ళీ—[illegible]సారి కొంచెం గట్టిగా— త[illegible] కాని ఎవరూ మాట్లాడకండ[illegible] మంత్రాలు వి[illegible]తా[illegible]మోనని చె[illegible]ప్పళ్లి భాగవతార్ రికార్డు [illegible] చడం మొదలెట్టారు!'

'ఓరి, వాళ్ళశిగ [illegible] పోసీ [illegible] వచ్చినట్లు కేకలు వేయలేక పోయాడూ ఆయన!'

'అంతపనీ చేశాడు పా[illegible] విడిచి—నేను పెళ్ళికొడుక[illegible] యింటి పెద్దఅల్లుణ్ణిరోయ్ [illegible] అరిచాడు. అయితే నమ్మేదెవ[illegible] ఆఖంగారులో? ఎవడో [illegible] వాడు, దొంగముండాకో[illegible] అని ఎవ్వర్నీ ఆప్రాంతాలకు [illegible]వ్వలేదు ప్లీడరుగారు '

రచయిత

భావరాజు నరసింహారావు

ఇంతకూ అల్లుడు సంగతే మైందికి?'

'ఏముందీ, విసుగుపుట్టి, కోప మొచ్చి, ఏంచెయ్యడానికీ తోచక ఎదటింటి డాక్టరుగారి అరుగుమీద చతికిలబడ్డాడు'

'రామ! రామ! ఎంతిపరాభవం!'

'ఇంకా వుంది మూడుముళ్లూ పడ్డతరవాత ప్లీడరుగారితల్లి గేటు తీసి బైటకొచ్చింది ఆవిడ తమ్ముణ్ణి సాగనంపటానికి'

'అప్పుడే బయలుదేరాడేం ఆయన?'

'అదోగొడవ ఆయ నొక కరణం ఊళ్లో రెండోపార్టీ వాళ్లు పెళ్ళికి కేసుపెట్టి తనను సాక్ష్యం వేస్తారేమోనని, దీపాలుపెట్టేటప్ప టికి చేరి, మూడుముళ్లూ పడగానే వెళ్ళి తెల్లవారేసరికి ఊళ్లో ఉండాలని'

'మొత్తంమీద అంతా తగిన వాళ్లు!'

' ఆవిడ తలుపుతియ్యగానే యీముక్కోపిఅల్లుడు వెళ్ళి ఇంతాకట్నుంచీ తలుపుకొడ్తూంటే తియ్యలేవమ్మా? అని కొంచెం గట్టిగా దబాయించాడు ఆవిడ ఖంగారుతో ఎందుకు తియ్యాలీ? ఇవ్వాళ మాయింట్లో పురిటి నీళ్లు అడ్డమైనవాళ్లూవచ్చి ఇల్లు పాడుచేయడానికా? వ్యవహారాలుంటే పొద్దున చూసుకోవచ్చు' అంది

'రాత్రిపూట పురిటినీళ్లా? అడ్డమైనవాళ్లా, ..నాకు తెలియదనుకున్నారా పెళ్ళిసంగతి .. అందుకే వచ్చా.' అని కొంచెంతీవ్రంగానే జవాబిచ్చి, మళ్లా శాస్త్ర నిదానించి తనసంగతి చెప్పాలనుకుంటూండగానే ఆవిడ మరీ గాబరాపడి నాలుగుతిట్లుతిట్టి గభీమని తలుపువేసి లోపలికిపోయింది ఆ దెబ్బతో మన అల్లుడు ఉగ్రుడయ్యాడు వీళ్ళతస్సాదియ్యా,వీళ్ళింటికికూడులేక వచ్చినట్లు మాట్లాడుతోంది పోనీ నూవాళ్ళకైనా బుద్ధిఉండొద్దూ? వీళ్ళదుంపతెంచుతాను' అని రుంజుకుంటూ చక్కాపోయాడు'

'ఎంత అవస్థపట్టిందీ, పాపం!'

ఇంకా తమాషా బైటయింత హడావుడిచేసిన ఆముకలమ్మగారు లోపలికిపోయి ముక్కపెగలకుండా పెళ్ళిమంటపందగ్గిర చతికిలబడ్డది. ఎవరొచ్చి పలకరించినా మాట్లాడదు—ఊరికే ఆయాసపడుతుంది, కళ్లెంట నీళ్లు కారుస్తుంది ఆవిడకేదో జబ్బుపుట్టిందని కూతుళ్లు, మనమరాళ్లూ చుట్టూచేరి ఏడుపు ప్రారంభించారు. వీళ్ళఏడుపుచూసి ఏదో విపత్తు సంభవించిందని వాళ్ళని కావిలించుకుని ఆవిడ వాళ్ళతో శ్రుతికలిపింది

'మొగాళ్లుకూడా వాళ్ళతో ఏకీభవించక పోయారు?'

'మహాఘనందుగాడుండేది—కాని మేమంతా వెళ్ళి అసలు సంగతేవిటో తెలుసుకోకుండా యీగోలేవిటని విచారించగా ఓపలేని ఆవిడ మనసు కుదటపర్చుకని ఎవడో పోలీసువాడు మనింట్లో పెళ్ళిసంగతి తెలుసుకున్నాడు . ఎందాకవచ్చి అంతా కనిపెట్టిపోయాడు అని జరిగిననాటకమంతా మెల్లిగా చెప్పింది'

'ఆవిడకూడా తెలుసూ యీ బిల్లుగొడవ?'

'ఆవిడ కేవిటి యింట్లో గోడలకు కూడా తెలిసింది, మనప్లీడరుగారు మూణ్ణెల్లనుంచీ చేస్తున్న తర్జనభర్జనలతో'

'ఇంతకూ ఆయనేవంటాడు?'

'ఏవిటి అనేది? నిండామునిగిన వాడికి చలేవిటి? అంతా అయిన తర్వాత అతిధైర్యంగా కబుర్లు చెప్పటం సాగించాడు, తానన్నిటికీ సిద్ధంగా ఉన్నానని.'

'ఆధైర్యం ముందేఉంటే ఎంత బాగుండేది!'

'ఇహ, ఆవెళ్ళిపోయిన అల్లుడు తనమామగారు తనను పిలిపించి యీవిధంగా అగౌరవపర్చాడనుకొని, తాను భార్యను వదలివేస్తున్నట్లూ, కావలిస్తే మనోవర్తికి దావా వేసుకోమనీ రిజిస్టరు ఉత్తరం యిచ్చాడు!'

'అయ్యో, వీడిల్లు బంగారాళాగానూ! ఏదో పొరబాటువల్ల జరిగిన దానికి యింత రాద్ధాంతమా?'

'ఇది యిల్లాఉండగా ఆరాత్రి గేటుబైట జరిగిన నాటకమంతా చూసిన ఆఎదటింటి డాక్టరు యీ అల్లుణ్ణీ, యింకా కొందర్నీ సాక్ష్యం వేసి కేసు దాఖలుచేశాడు, శారదాఆక్టు కింద!'

'అన్నివిధాలా అనర్థమేవచ్చిందే! ఇన్ని ఫర్లాంగులదూరం ఆలోచించిన ప్లీడరుగారు యిలా పప్పులో కాలేశారేం? చివరికి వట్టి ఓబయ్య అనిపించాడే!'

## 2

## గాంధీ దేవుడు

[మధ్యాహ్నం 2 గంటలకు. ఎండ బాగా తీక్ష్ణంగా ఉన్నప్పటికీ గ్రామంప్రక్కన ఉన్న రోడ్డుకు రెండుప్రక్కలా ఓపికతో గాంధిగారిరాక కెదురుచూస్తూ బారులు తీర్చి ఉంటారు]

ఒకపిల్ల —అమ్మా! దేవుడేడీ?

తల్లి —తొందరపడతావేం మోటార్లోవస్తారుండూ, మరీ. ఆయనరాగానే మేమంతా హారతులిచ్చి, దణ్ణాలుపెడ్తాం.

పిల్లవాడు —మరి మేంకూడా దణ్ణాలుపెట్టవచ్చా?

తండ్రి —అయ్యో! తప్పకుండా!

పిల్ల —నాన్నా! గాంధీదేవుడికి మాపుస్తకంలో 'దేవుడికిలాగు నాలుగుచేతులు ఉంటాయా?

పిల్లవాడు —మూడుకళ్లు ఉంటాయా, నాన్నా! శివుడికిలాగా?

తండ్రి —(నవ్వుతూ పారజూచి) అదుగో దేవుడొస్తున్నాడు మీరేచూచి చెప్పండి, ఆయనకు ఎన్నికాళ్లున్నాయో, ఎన్ని కళ్లున్నాయో.

(ఇంతలో కారువస్తుంటే గ్రామస్తులకోరికమీద గాంధీగారు కారుదిగి సహజమందహాసంతో హారతు లందుకుంటారు గ్రామస్థులు పాదపూజచేసి సాష్టాంగప్రణామాలు చేస్తారు ఆనందభాష్పాలతో, నిండుహృదయాలతో కారు గాంధీగారి నెక్కించుకుని వెళ్లిపోతుంది )

పిల్లవాడు —రెండుకళ్లే ఉన్నాయి నాన్నా!

పిల్ల —రెండుచేతులే వున్నాయి నాన్నా!

పిల్లవాడు —నీకుమల్లేనే మొతక అంగోస్త్రంకట్టుకున్నాడే!

తల్లి —చిక్కిపోయిన శరీరంలో బొమికలుకూడా అల్లాగే కన్పడుతున్నాయి పైకి.

తండ్రి —అవును నాయనా! మన దేశంలో ఎక్కువమంది కడుపునిండా తిండిలేక, ఒంటినిండా బట్టలేక ఎలా అల్లాడుతున్నారో ఆయనను చూస్తే లోకానికి అర్థమాతుంది.

ప్రక్కనయింకొకరు — 'పరిత్రాణాయసాధూనాం' అన్నట్టు సరిగ్గా ఉద్భవించాడండీ మనల్ని ఉద్ధరించడానికి. ఎంత పుణ్యం చేసుకున్నామో ఆయన అమృతవాక్కులు వినగలిగాం! నిజంగా మన జన్మలు తరించాయి ఆయన దివ్యదర్శనంతో!

## 3

## ఆదర్శ కౌన్సిలర్

[ఆదివారంసాయంత్రం 4 గంటలకు నాలుగేళ్ళ పిల్లవాడు ఆత్మసంరక్షణార్థం (శునక వరాహాదుల వల్ల ప్రమాదంలేకుండా ఉండటానికి) ఒక చిన్నకర్ర చే[illegible]కుని వీధిప్రక్కన [illegible]స్తూంటాడు తల్లి ఎదురు[illegible]మ్మంలో కూర్చుని ఉంటుంది. ప్రవేశం ముప్పై ఏ సంవత్సరాలుగల ఒక వ్యక్తి, శుద్ధ ఖద్దరులో.]

వ్యక్తి —అమ్మా! దొడ్లోపాయ్‌ఖానాదొడ్డి ఉండగా పిల్లవాణ్ణి బయటకూర్చోనిస్తున్నారా! ఇందువల్ల జబ్బులు పుడతవి. .

తల్లి —(సాగతీస్తూ) ఆఁ! అల్లాగా? తమరెవరూ చెప్పడానికి? రోజుకు ఒక్కసారి—పొద్దున—పాకీవాడొస్తే, చంటిపిల్లలు అప్పటిదాకా కవిపెట్టుకు కూర్చోగలరుగామరి?

వ్యక్తి —అమ్మా! కోప్పడకండి. పిల్లవాడికి ఉదయంపూట [illegible]లాగు అలవాటుచేయండి, [illegible]చిది. లేకపోతే [illegible]రవాతనైనా దొడ్లోకి వెళ్ళేటట్టు కూడాఅలవాటు చేయండి. [illegible] వీధి ఎల్లా పాడైపోతోందో!

తల్లి —వీధి పాడైపోతోందా? [illegible]తే యీమునిసిపాలిటీ [illegible]కూ, యీపన్ను లెందుకు[illegible]చ్చినట్టు వాళ్ళే బాగుచేస్తారు.

[పిల్లవాడు పనిపూర్తిచేసి లేస్తాడు, తల్లివాణ్ణి వెంటబెట్టుకుని యింట్లోకి తీసుకుపోతుంది. ఆవ్యక్తి ఒక కాగితంతెచ్చి, పెంటఎత్తి దూరంగాఉన్న మ్యునిసిపల్ డబ్బాలోవేసి పంపుదగ్గరకు వెళ్తాడు చేతులు కడుక్కోవడానికి.]

ప్రక్కయింటావిడ — (పైనజరిగిన సంగతంతా గమనించి)

ఇదుగో కాంతమ్మగారూ! ఆయన యేంచేశాడో చూశారా! సిగ్గుచేటుకూడా—మీ అబ్బాయి వెంట ఆయన ఎత్తి వేశాడు ?

కాంతమ్మ—ఆఁ! నిజంగా! అయ్యో! అయ్యో! ఎంతపాపం చేశాను!

(తొందరగా పంపుదగ్గరకు వెళ్ళి ఎంతో నొచ్చుకుంటూ, క్షమాపణలతో ఆయన చేతులమీద నీళ్లు పోసి, తన చీరచెంగు యిస్తుంది తుడుచుకోవటానికి.)

వ్యక్తి—(చేతులుకడుక్కుని) అమ్మా! సంతోషం నాడుత్తరీయమున్నది చేతులు తుడుచుకోట్టానికి. మీరు విచారించకండి ..

(ప్రవేశం వెంకట్రావు—కాంతమ్మ భర్త—అప్పుడే ఎక్కడనుంచో వచ్చి భార్య యింట్లో లేక పోవడంచేత ఎక్కడకు పోయిందో వని కేకలువేస్తూ, ఆవ్యక్తినిచూసి చప్పున నాలుకనొక్కుకుంటూ ఆయనకు వినయంగా నమస్కరించి)

వెంక—ఇలా దయచేశారేం? నావల్ల యేమైనా పనికావలసి ఉన్నదా ?

వ్యక్తి—మరేమీలేదు. ఊరికే యీవీధికి వచ్చాను చేతులు మకిలి అయితే పంపుదగ్గర కడుక్కుని వెళ్తున్నాను

వెంక—చిత్తం.

(ఆవ్యక్తి వెళ్ళిపోతాడు)

వెంక—(ఆవ్యక్తి వంకచూస్తూ) ఎంత నిగర్వి! అంత డబ్బున్నా, అంతచదువు చదివినా, ఎంత నిరాడంబరంగా ఉంటాడో! ఆయ నొక జమీందారనిగాని, ఇంగ్లండులో చదివివచ్చాడనిగాని ఎవడన్నా అనుకుంటాడూ ?

కాంతమ్మ—మీకు యీయన ఆఫీసులోనేనా పని ?

వెంక—అవును. ఇన్నాళ్ళనుంచీ యింత సుఖంగా మనం జీవనం చేయడానికి ఆయన మంచి హృదయమే కారణం ఆయనే మనవార్డుకు కొత్తగా పోటీలేకుండా ఎన్నుకోబడ్డ కౌన్సిలరు.

కాంతమ్మ—అయ్యో! కొంప తీశాను! ఎంత దుర్మార్గురాల్ని! (గుడ్లనీరు కుక్కుకుంటూ జరిగిన సంగతంతా చెప్తుంది. వెంకట్రావు సంగతంతా విని విచారపడతాడు. ఇరుగుపొరుగు వారంతా చుట్టూ చేర్తారు, వెంకట్రావు తన యజమాని సద్గుణాలు చెప్తాంటే)

వెంక—ఈరోజు లగాయతు యీ వీధంతా నేనే శుభ్రంచేస్తాను.

ఒకరు—అసలు యీవార్డులో యిల్లాంటి పనులు జరగకుండా నే చూస్తూఉంటాను.

ఒకయిల్లాలు—నిజంగా ఆయన మనకు మంచిపాఠం నేర్పారు. మనం యిప్పటికైనా బుద్ధి తెచ్చుకోవాలి.

ఇంకొకరు—మిగతా కౌన్సిలర్లంతా యిలాటి యోగ్యులైతే మనఊరు ఎంతైనా బాగుపడును.

# మేము కళ్లికోటవెడుతున్నాం

## కళ్లికోట కేరళదేశానికి హృదయకోశం.

దారిలో వక్షోభాగాన్ని కప్పుకోని నిరాభరణ సుందరులు.
ఊరిలో వెడుతూవుంటే అడుగడుక్కీ బ్యాంకులు.

'తెనుగుస్త్రీల చీరకట్టు నేర్చుకుంటే
మళయాలస్త్రీలు మరీ అందంగా వుంటారు.'

రచయిత:

యం. వి. కృష్ణరావు, బి.యె. (ఆనర్సు).

త్రిచూరులో ప్రొద్దున యేడుగంటలకు ఎర్నాకులం- షోరనూరు ప్యాసెంజరు యెక్కాను. ఈట్రైను కొచ్చిను సంస్థానం రైల్వేవారిది. షోరనూరుచేరుకుంటానికి గంటసేపుపట్టింది. ఇంతలో మలబారు ఎక్స్ప్రెసు వచ్చింది. రైలుపెట్టెలోంచి అటుయిటు చూస్తుంటె రమ్యమైన దృశ్యాలు కనిపించాయి: యెటు చూసినా కొబ్బరితోటలే; యేదిక్కు తిరిగినా పిల్లకాలువలే; అప్పుడప్పుడు దూరంగా అరేబియాసముద్రం కనబడుతూండేది. ఆకొబ్బరితోటల్లో వక్షోభాగాన్ని కప్పుకోకుండా నిరాభరణసుందరులు తిరుగుతున్నారు. తలక్రిందుగా తపస్సుచేసినా తూర్పుతీరంలో యిట్లాంటి దృశ్యాలగుపడుతాయా? సహజంగా సుందరంగాఉండే శరీరాల్ని కృత్రిమ వస్త్రాలచె కప్పకపోబట్టే వాళ్ళంత ఆరోగ్యంగా వున్నారనుకుంటాను. పాశ్చాత్యదేశాల్లో నగ్నసంఘాలు లెస్సగా వృద్ధిపొందుతున్నాయి; బీహారులో ఒక నగ్నసంఘాన్ని ఇటీవల స్థాపించారుట! ఈమధ్య జర్మనీలో కొందరు రోడ్లమీద దిగంబరులై తిరగ సాహసిస్తే హిట్లరు వాళ్ళని కారాగృహంలో పెట్టించాడు; హిట్లర్ పనిచేయడానికైనా వెనుదీయడు! కేవలం ఆరోగ్యంకోసం బెర్నార్డుషా ప్రతిదినం తెల్లవారుఝామున గంటసేపు వారితోటలో నగ్నంగా తిరుగుతాడట!

'తిరూరు' స్టేషనులో రైలాగటంతోనే జల్తారుజుట్టున్న ఒకవ్యక్తి కంగారుగా మా పెట్టెలో యెక్కాడు. హఠాత్తుగా చూసి అబిసీనియాదేశస్థుడేమో అనుకున్నాను. కూర్చోటంతోనే భోషాణంలాంటి పెట్టెతెరిచి 'పొగలై' (పొగాకు) తో సహా తాంబూలం వేసుకోటానికి ఉపక్రమించాడు.

'మీరూ వేసుకుంటారా?'

'నాకలవాటులేదు, క్షమించండి.'

పొగలై సరిపడక బారిస్టరు పార్వతీశంలా పెట్టెలో వాంతులుచేసుకుంటే, చూసేదిక్కులేదు, అందులో ఉన్నది కొత్తదేశంకూడాను! ..... క్షమించండన్నవాణ్ణి [illegible]కోక 'మీ రో సిగ[illegible]చ్చుకుంటారా?' అన్నాను.

'వద్దండి. తమరెక్కడనుంచి [illegible]న్నారు?'

'మద్రాసునుంచి.'

'ఉత్తరదేశస్థులులా కనబడుతున్నారు. బొంబాయిరాజధానా మీది?'

'బొంబాయి ఉత్తరదేశంలో చేరదే!'

ఆ జల్తారు జుట్టాయన అనవసరపు బాతాఖానీవల్ల వచ్చే తలనొప్పి పోవటానికి కనీసం నాలుగుడబ్బాల అమృతాంజనమున్నా వాడాలేమో! ఆయన పుణ్యమా అంటూ నన్ను విడిచిపెట్టి నాప్రక్క కూర్చున్న నాయర్ని పూతపట్టాడు.

'అయ్యా! మీరెవరో తెలిసికోవచ్చునా?'

'నేను రిటైరుడు తహసిల్దారుని'

'మీ స్వగ్రామం?'

'మంజేరి'

'ఇన్నిప్రశ్నలడిగి మీకు శ్రమకల్గిస్తున్నానేమో!'

'మరేంలేదులెండి, మీరు కేరళదేశానికి రావడం యిదే మొదటిపర్యాయమని తలుస్తాను.'

అభయహస్తం యివ్వటమే తడవుగా ప్రశ్నపరంపరలు కురిపించాడాయన. రెండునిమిషాలు మాట్లాడితే ముక్కుమొహం యెఱగని యెవరినైనా చిరపరిచితుణ్ణి చేసుకోగల సమర్థుడు; ఆయన తత్వంప్రకారం క్రొత్తఅనేది యీ భూప్రపంచంలో యెక్కడా లేదుట!

'అయితే మీదేశసాంఘికపరిస్థితుల్ని తెలుసుకోవాలంటె యెక్కడ మంచి అవకాశముంటుంది?'

'పట్నాల్లో అట్లాంటివాటి కెంతమాత్రం వీలుండదు. కొంతకాలంపాటు యేదైనా గ్రామంలో మకాంపెట్టి భోగట్టా చెయ్యాలి.' అన్నాడు గంభీరంగా రిటైరుడు తహసిల్దారు.

ఇక సంభాషణ కేమి విషయం దొరకనట్లున్నది, అందుకని స్వీయచరిత్ర చెప్ప

డ మారంభించాడు

'నాపేరు కుంభకోణం పరమేశ్వరయ్యరే. ఇప్పుడు మన పెట్టెవద్దకువచ్చినాయన నాసోదరుడు, సేలంలో అడ్వకేటు. ఈరైల్లోనే సెకండుక్లాసులో ప్రయాణంచేస్తున్నారు. మేము కళ్ళికోట వెడుతున్నాము. బహుశ స్టేషనుకి మా కమీషనర్ రావచ్చును. ఆయన మా సౌకర్యాలు చూస్తాడులెండి?'

ఎవడికొ్కావాలివన్నీ అన్నట్లు చూస్తుంటే, నావంకతిరిగి,

'మీరెక్కడికి వెడుతున్నారు?' అన్నాడు.

'నేను కళ్ళికోటే, మహానుభావా!'

'ప్రస్తుతం యేంచేస్తున్నారు?'

'రైల్లో ప్రయాణంచేస్తున్నాను.'

'అదికాదండి – అసలు మీరెవరని?'

నేనెవరైతే నీకెందుకయ్యా ..?'

తర్వాతవు ముగించి దేశపర్యటనం చేస్తున్న ఒకవ్యక్తిని.'

తా నడిగేప్రశ్నలకు నావద్దనుంచి సరియైన సమాధానాలు రావని గ్రహించి, ఆ అరవసోదరుడు రిటైరుడు తహశిల్దారుని పట్టితోమాడు. ఆ నాయరు మెతకవాడులాగున్నాడు. లేకపోతే ఒకక్రొత్త మనిషి అడిగే అది అంతులేని ప్రశ్నావళికెవరు జవాబులిస్తారు?

'కేరళదేశం పరిశ్రామికంగా ముందంజ వేసిందంటారు, మరి మీ దేశపరిశ్ర లేమిటో సెలవిస్తారా?'

'పెంకులు, చేపలు సబ్బు, కొబ్బరి, కొబ్బరినూనె, తాటినార ..'

ఇట్లా ఒకపట్టీ యేకరువుపెట్టడంతో పరమేశ్వరయ్యర్ వాక్ప్రవాహం గడ్డకట్టిపోయింది. పెదవి విరిచి నాతో యిలా అన్నాడు.

'మలబార్లో ఫార్మింగ్ పరిశ్రమపెడితే వృద్ధిలోకిరావచ్చును.'

'నా కెందుకొచ్చిందిదంతా? ఏదో దేశంచూడామని వెడుతున్నాను. నన్ననవసరంగా బాధపెట్టకండి. అంత ఉత్సాహముంటె ఆతంటాలు మీరేపడండి.'

ఎక్స్ప్రెసు కళ్ళికోట చేరుకునేసరికి పదకొండుగంటలైంది. కళ్ళికోటస్టేషను యిల్లులాగుంటుంది. అందువల్ల రైలు పెట్టెలన్నీ చీకటిమయమైపోయాయి. స్టేషనులో ఆగినకాసేపు పెట్టెలలోని దీపాల్ని వెలిగిస్తే ప్రయాణీకులకు, సామానులు తీసుకోటం పెట్టుకోటంలో, సదుపాయము చేసినవారౌతారని రైల్వే అధికారులకు మనవిచేస్తాను. ప్లాటుఫారం మీద నారాయణ నాకోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు. సామానుదింపించి 'పుదియారా'లో వున్న వాడింటికి వెళ్ళాము. ఊళ్ళోనుంచి వెడుతుంటె అనేకబ్యాంకులు కనబడ్డాయి. మలబార్లో పరిశ్రమ లెట్లాగెక్కువో, అట్లాగే బ్యాంకులూను! మనవాళ్ళకిమల్లే ధనాన్ని యిల్లు పాలాల మీద వేయకుండా, మరిన్నీ వైశ్యశిఖామణులమాదిరి యినుపపెట్టెలలో దాచి పూజచేయకుండా, కేరళీయులు వాణిజ్య పరిశ్రమల్లో వేసి సద్వినియోగం చేస్తారని నేను గ్రహించాను. అసలు ధనం వస్తువుల మారకంకోసం యేర్పడ్డది. అట్లాంటి దాన్ని భద్రంగా దాచిపెట్టడం దాని ఉద్దేశాన్ని భంగపరచడమని గుర్తిస్తే ధనాన్ని మూలను కూడబెట్టే దురలవాటు హిందూదేశంలో తగ్గిపోతుంది.

మా నారాయణ కేరళదేశంలో నివాసంయేర్పరుచుకున్న అరవబ్రాహ్మణుడు. కాబట్టి వాడుభయభాషాప్రవీణ, అనగా అరవమళయాళభాషలు ధారాళంగా మాట్లాడి అర్థంచేసుకోగలడు. నారాయణ తండ్రి కళ్ళికోట పిచ్చిఆసుపత్రి సూపర్నెంటు. ఆయన సాయంకాలమప్పుడు ఆరోగ్యంనిమిత్తం ఒకగిన్నెడు ద్రాక్షపళ్లరసం త్రాగుతాడు. ఆయన బలవంతం మీదనే నొకఅవున్సు పుచ్చుకున్నాను; ఆ రసం మధురంగాఉండి తాత్కాలిక ఉల్లాసాన్నిచ్చింది. ఆసుపత్రి నిర్వహణంలో ఎట్టిజోక్యం కలుగజేసుకోకపోవటంచేత సూపర్నెంటె చాల మంచివాడుట! అంతా క్రిందఉద్యోగస్థులకు వొదిలి గుండెమీద చేతులువేసుకుని హాయిగా నిద్రపోతున్నాడు.

కళ్ళికోట బ్రిటీషుమలబారుజిల్లా ముఖ్యపట్నము. 1493 లో పోర్చుగీసు యాత్రికుడైన 'వాస్కొడగామా' మొట్టమొదట కళ్ళికోట వేంచేశాడు. కళ్ళికోటకు సరకుల ఓడల రాకపోకలు-కలిగిన రెండురేవులున్నాయి; ఏడుమైళ్ళ పొడుపున్న సముద్రతీరమున్నది. దక్షిణజిల్లాలనుంచి వచ్చే వేరుశెనగ, వైనాడు (Wynad) యెస్టేట్లనుంచి వచ్చే తేయాకు ఈరేవులగుండా విదేశాల కెగుమతిచేస్తారు. ఎగుమతుల ప్రమేయాన్ని తలుచుకుంటె అణుమాత్రం జాతీయతత్వమున్న ప్రతిభారతీయుడు ఖిన్నుడైపోతాడు. మనదేశంలో పండే ముడిపదార్థాల్లో సుక్షేత్రమైనవాటిని, భారతీయులు తినటానికి వీలులేకుండా విదేశాల కెగుమతి చేస్తున్నారు. మనదేశంలోపండిన మంచివస్తువుల్ని తినటానికి మనవాళ్లు నోచుకోకపోవడం యెంతశోచనీయం! దీనికి నిదర్శనంగా ఒక చిన్నసంగతి తెలుపుతాను. మెంగళూరులో యాలక్కాయల వ్యాపారంచేసే మిత్రుడు నా కొకడున్నాడు. నీయాలక్కాయల నెప్పుడు రుచిచూడలేదు. ఎట్లావుంటాయో చూస్తాను నాలుగివ్వుమని అడిగితే నాలుగు యాలక్కాయలిచ్చాడు. అవి యెట్లాంటివనుకున్నారు? నే నింతవర కెన్నడు చూడనివి, యికముందు చూడబోనివి! అట్లాంటివి మనదేశంలో కొందామన్నా దొరకవు. మంచివాటిని యేరి విదేశాల కెగుమతిచేయడం అందరికి తెలిసిన కారణం, ఇంకొకటి మనవాళ్లు ప్రతివస్తువు చౌకధరకి కావాలనటంవల్ల నాణ్యం తక్కువైన సరుకు సప్లయిచేస్తారుట! సాధ్యమైనంత తక్కువధరకు కొనమని అర్థికసూత్రం ఉండనేవున్నది. అందుకని నా కైరెండో హేతువు ఎంతమాత్రం నచ్చ లేదు. మనం నిత్యం వాడే లవంగాలు వొట్టి

చెత్త- నిస్సారమైనవి- పనికిరాక బయట పారేసినవి. వాటిని వర్తకులు తెప్పిస్తున్నారు. మనం వెలకుకొని కిమ్మనకుండా వాడుతున్నాము. ప్రపంచంలో యెక్కడన్నా వున్నదీ యిల్లాంటి అన్యాయం! ఈఆర్థికదుస్థితులన్నిటికి పరదేశప్రభుత్వమే మూలం; ప్రజలని పీల్చి పిప్పి చేసే సామ్రాజ్యతత్వం పోనంతవరకు మన దేశం సర్వతోముఖంగా వృద్ధిపొందదు. అంతపర్యంతం భారతీయులు ప్రపంచసౌఖ్యాల్ని అనుభవించటానికి తగరు. ఇట్లాంటి అవమానకరమైన పరిస్థితుల్ని చూసి భారతీయులంతా స్వరాజ్యసంపాదనకి గట్టిగా కృషిచేస్తారని విశ్వసిస్తాను.

తాటినార, కొబ్బరి, కొబ్బరినూనె, తేయాకు, వరి, వేరుశెనగ, పోకచెక్కలు వగైరా కళ్ళికోట ముఖ్యవ్యాపారవస్తువులు. సుప్రసిద్ధమైన సబ్బుఫ్యాక్టరీ కళ్ళికోటలోనే వున్నది. జామరిన్ పురాతనభవనము, 'వరక్కల్'లోని దేవాలయం, రోమన్ క్యాథలిక్ కెథీడ్రల్, జర్మన్ బేసిల్ మిషన్‌చర్చి చూడదగిన కట్టడములు.

'పుదియారా' కళ్ళికోటలో మారుమూల ఉన్న ఒక ప్రశాంతమైన పేట. పిచ్చిఆసుపత్రినిబట్టి ఆపేటకు ప్రాముఖ్యత వచ్చింది. ఒకసారి నారాయణ నేను ఆసుపత్రి చూద్దామని వెళ్ళాము. ఆసుపత్రిఉన్న రెండెకరాలస్థలంలో కొబ్బరి, పోక, సరుకు చెట్లు పుష్కలంగా వున్నాయి. బాటలన్నీ తీర్చి దిద్దినట్లున్నాయి; చెత్తచెదారం లేకుండా రోడ్లు పరిశుభ్రంగా అద్దాలులాగున్నాయి. ఆసుపత్రిలో మూడురకాల పిచ్చివాళ్లున్నారు; (1) పిచ్చి చాలయెక్కువగావుండి బాహుబలాన్ని ఉపయోగించేవాళ్లు. వీళ్ళని విడిఖైదీలకి మల్లేగదికి ఒకణ్ణిచొప్పున ఉంచుతారు; పెద్దపెద్ద బొబ్బలు పెట్టి కిటికీమవ్వాలు విరవటానికి ప్రయత్నిస్తుంటారెప్పుడు. వీళ్ళని పొరపాటున విడిచిపెట్టే బోనులోంచి విడిచిన పెద్దపులులాగ యెంతన్నా గందరగోళం చేసి ఆసుపత్రియావత్తు ధ్వంసంచేస్తారు. (2) పిచ్చి అంతెక్కువ ఉండకుండా ఊర్కే వాళ్ళలోవాళ్లు మాట్లాడుకుంటూ, పాడుకునేవాళ్లు; వీళ్లు యెక్కువ తొందరచెయ్యరు. ఎవడిపిచ్చి వాడికానందం అన్నట్లు వాళ్ళ గోలేమిటో వాళ్ళది! (3) పిచ్చి కాస్తతగ్గి మనుష్యుల్ని ఆనవాలు పట్టి, అసందర్భంగా మాట్లాడేస్థితిలో వున్నవాళ్లు. ఈ రకపుమనుష్యుల్ని అప్పుడప్పుడు బయటకు వదుల్తాంటారు. అయితే ప్రహరీ గోడదాటి బయటకుమాత్రం పోనివ్వరు. ఊర్కేవుంచకుండా యేదో పనిపాట చేయిస్తారు; అద్దకం, నేత, తాటినారతీయటం వగైరా. వీళ్లది యేధోరణిపడితే ఆధోరణే! వీళ్లు ఆడుకుంటాని కో-బ్యాడ్‌మింటన్ కోర్టున్నదా ఆవరణలో. పిచ్చివాళ్లు ఆడటము పోయి సూపర్నెంటుపిల్లలు వాళ్ళస్నేహితులు ఆడుకుంటున్నారని విన్నాను. ఆసుపత్రిలో తిండిసౌఖ్యం బాగావుండటంవల్ల చాలమంది ఆసుపత్రి విడిచిపోవటానికి యిచ్చగించడం లేదుట.

కేరళదేశానికి కళ్ళికోట హృదయకోశంలాంటిది. కాబట్టి ఆదేశాన్ని వర్ణించడం అవసరం. కేరళదేశం చిత్రోపమయమై మనోహరంగా వుంటుంది; సమశీతోష్ణత గలిగినప్రదేశం. పిల్లకాలువలు, చెలమలు, కయ్యిలు (Backwaters) చిత్తాహ్లాదకరాలు. కాశ్మీరం మినహా, భారతదేశంలో దివ్యానందబంధురం, అతులితమనోజ్ఞకరమైన యిట్టిదేశం లేదని చెప్పవచ్చును. కయ్యిలమీద యేమి సౌందర్యకళాప్రసారం! కళ్ళికోటకు నలభైమూడుమైళ్ళదూరంలోవున్న 'తెల్లిచేరీ' అనేఊళ్లో ప్రకృతిలక్ష్మి విచ్చలవిడిగా సంచరిస్తోంది. మలబారు సౌందర్యాన్ని తనివితీర గ్రోలదలచిన వాళ్లు 'తెల్లి చేరీ' తప్పకుండా వెళ్లాలి. 'నేపిల్సు చూసి మరీచనిపో' అని చిన్నసామెత ఉన్నది యింగ్లీషులో. తెల్లిచేరీ విషయంలోకూడా ఈసామెత జ్ఞాపకముంచుకోతగ్గది.

మలబారులో చెప్పుకోతగ్గ చలి[illegible]టిలేదు. అయితే సంవత్సరానికి 100—150 అంగుళాలవర్షం కురుస్తుంది. తూర్పుతీరానికి పశ్చిమతీరానికి వర్షపాతం విషయంలో చాల వ్యత్యాసముంది. సం

వత్సరానికి [illegible]తీరంలో కొద్ది వర్షం కురుస్తుంది. వానతక్కువైనా బ్రహ్మాండమైన నగులున్నాయి ఈనదులుండబట్టే సస్యశ్యామలంగావున్నది ఆంధ్రదేశం మన కేమిరాకుండా వర్షమంతా మలబారువాళ్లు త్రాగేస్తున్నారని కొందరు ఆంధ్ర సోదరులు చెప్పగా విన్నాను ఆవర్షమే లేకపోతే కేరళదేశం ప్రకృతిలక్ష్మి నెలవౌటానికి బగులు రెండోదక్కనుపీఠభూమి అయేది పాల్ఘాటు కనుమ అడ్డం వుండి, ఆవర్షపవనాన్ని తూర్పుతీరానికి రాకుండాచేస్తోంది అందుచేతనే పశ్చిమతీరంలో మాగాణిపంటలు బహుతక్కువ, మెరకపంటలు చాల యెక్కువ

ఆడుమలయాళం జగత్ప్రసిద్ధం, చరిత్రాత్మకం మద్రాసులో తిరిగే మలయాళస్త్రీలనిచూసి అంతా అట్లాగే వుంటారనుకోవడం గొప్పపొరపాటు ఆ దేశంలో- ముఖ్యంగా గ్రామాలలో యెక్కువకాల ముండకుండా, ఆదేశస్త్రీల నెక్కువమందిని చూడకుండా, వాళ్ళని గూర్చి క్రమవివరణచేయడం సమంజసం కాదు మలయాళస్త్రీలని చాలమందిని చూడటమేకాకుండా, సౌందర్యకళలో రిశెర్చిచేశాను గనుక, వాళ్ళని నిష్పక్షపాతంగా వర్ణించడానికి నాకు యోగ్యతవున్నది దక్షిణహిందూదేశంలోకల్లా కేరళస్త్రీలు (అయ్యంగారువనితలది ఆ దోకరకమైన అందంలెండి!) మంచిరూపురేఖావిలాసాలున్నవాళ్లు, మిక్కిలి చక్కనివాళ్లు ఈసంగతి ఆందచందాలంటే యేమిటో యెఱగనివాళ్లుకూడా ఒప్పుకుంటారు. వస్త్రధారణనిబట్టి, దూరాన్నుంచి వెనకాలకి కేరళస్త్రీలు ఒకే మాదిరి ఉండటంవల్ల, క్రొత్తవాళ్లు వాళ్ళనిచూసి మగవాళ్లేమో అనుకుంటానికి అవకాశమంది అయితే వాళ్ళ వస్త్రధారణలో మార్పుచేసుకుంటె చక్కని చుక్కల్లాగుంటారు ఇప్పుడిప్పుడు చాలవరకు మార్చుకున్నారు లెండి! ఆంధ్రవనితల్నిచూసే నేర్చుకున్నారని నా అభిప్రాయం తెలుగుస్త్రీలకట్టుని అనుసరించే అన్యదేశస్త్రీలను చాలమందిని చూశాను చీరకట్టులోమాత్రం భారతదేశస్త్రీలకు ఆంధ్రవనితలు పెట్టిందేభిక్ష! మలబారులో అందరు తెల్లటివస్త్రాల్నే- వాటిని చీరెలంటానికి వీల్లేదు- కడతారు పూర్వసువాసినులు, క్రైస్తవవనితలు మినహా, ఆంధ్రదేశంలో అంతా రంగుచీరెలని విధిగా కడతారు ఈ మధ్య యెవరో ‘మద్రాసు మెయిలు’లో ‘Telugus are Colour-loving people’ తెలుగువారికి రంగులంటె ప్రీతి అని వ్రాశారు అదెంతేనా నిజమైన మాట! పసిమిరంగు శరీరాలున్నవాళ్లు యేకరీతిగా తెల్లటివస్త్రాలు ధరించడంకంటె యింపైన రంగుచీరెలు కడితే దివ్యంగా వుంటారనినానమ్మకం ఇతర దేశస్త్రీలవలెగాక, మలయాళస్త్రీల— చదువుకున్న నవనాగరికనారీమణులను విడిచిపెట్టాలి- దేహాలు బట్టబయలై వుంటాయి బంగారంలాంటి ఛాయయున్న వాళ్లు సహితం పౌడర్లు, క్రీములు వాడిపైకి యింకా సొగసుగా కనబడాలని తీవ్రప్రయత్నాలు చేస్తున్న యీరోజుల్లో చక్కటి దుస్తులు ధరించిన కృత్రిమ సౌందర్యానికి నిగ్గయిన పౌడర్లు, క్రీములు వాడకుండా మనోహరంగా వుండాలంటే యెంతకష్టమో మీరే ఊహించండి!

---

# రాష్ట్రగానము

౧

సీ. చేసేతనందితెచ్చిరి నైష్ఠికులు పావనాంధ్రవేణీతీర్థమలసిసాల్లసి
నెఱవేడ్కముగ్గికట్టిరి చిన్నిబాలకుల్ తూర్యధ్వనులతోనదోరణములు
అర్ఘ్యంబుపాద్యంబు నర్పింప భక్తిమై సిద్ధమైయున్నారు వృద్ధజనులు
కాకలీధ్వనుల మంగళగీతికలుపాడ నాయత్తమయ్యెఁ గన్యాజనంబు
వేదబుక్కుల నిన్ను సేవించు కొఱకు
శ్రోత్రియులు వచ్చినారు పవిత్రమతులు
ఆంధ్రజనయిత్రి! మాపూజ లందకొఱకుఁ
గదలిరావమ్మ! సుమూహూర్తకాలమయ్యె.

౨

మ అదిగో! తెల్గులతల్లి దివ్యరథ, ముద్యత్కాంతిపుంజంబులన్
బదిదిక్కుల్ వెలిఁగించుచున్ గదలెడిన్, బ్రస్థానభేరీధ్వనిన్
బధిరంబయ్యె జగంబు, మీకుఁగలకాన్కల్ తల్లి కర్పించి, తద్
రథమున్ లాగుఁడు మాతృభక్తి దయివాఱన్, దెల్గువీరాగ్రణుల్.

౩

ఉ. ఆరథనేమిఘట్టనల కగ్గములై మనహేయకాయముల్
తీఱినఁ దీఱుఁగాక! చనుదెందు విచారములేల? మాతృసే
వారమణీయవృత్తమున వందురి సచ్చినవారి జాహ్నవీ
తీరమునందు భోగములఁదేల్తురు వెన్నెలరేల నచ్చరల్

—తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

## ‘ఆడదానికి మాటామర్యాదా దక్కాలంటే రెండూ వుండాలి.’

# ‘సహంలోనే తాటాకులు…’

## క్రాస్‌వర్డుపజిల్ సాల్వ్‌చేయడంలో గాడిదలు తఱుచు యేమిచేస్తూవుంటాయి?

క్రాస్‌వర్డ్‌పజిల్ సాల్వ్‌చేయడంలో

‘పాదద్వంద్వము నేలమోపి పవనుం బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మారాకు హత్తించి ’

మరీ ఆలోచిస్తాడు శ్యామలరావు

కాని అతనికి సహంలోనే తాటాకులు తగిలాయి

చిన్నకథ

రచయిత్రి

శ్రీమతి బులుసు ప్రకాశమ్మ

౧

‘ఏమ్! ఏంజేస్తున్నావ్?’

‘ ’

‘ఇదుగో, ఏం జేస్తున్నావ్? ఓమాటిల్లారా ’

‘అన్నం వార్చుకుంటున్నాను ఎందుకు?’

‘చిన్నసలహా, వంట తరవాత చూడొచ్చు లే- ఇది ఆడవాళ్ళకి సంబంధించిన సంగతి ఇందులో నీయాలోచన ఎల్లావుంటుందో చూద్దామని ఓమాటిల్లావచ్చి వెళ్లు ’

అంటుచేతో ఇవతలకొస్తూ——

‘దబ్బున చెప్పండా గొప్పసంగతేమిటో అవతల పోపు మాడిపోతోంది ’

‘కొంచెం——స్థిమితంగా ఆలోచించాలి పోపుపని కానిచ్చుకు మరీ రా ’

‘నాతోనా సలహా ఏమి నాఅదృష్టం ఇందుకే కాబోలు ఈవేళింత యెండకాస్తోంది ’

‘నీశెక్చర్ కాస్సేపు కట్టిపెట్టి ముందిది విను ఆడవాళ్ళకి నగల మీద ఎక్కువ ప్రీతి అంటావా, చీర్లమీదా?’

‘ఇదా! యేమిటో అనుకున్నాను మీరు పడుతున్నారు చాలుగానీ నన్నుకూడా పడెయ్యకండి ఈ గొడవల్లో ఈఆలోచన్లు ఈజన్మలో తెగేవికావు ’

‘అబ్బా, అవునుగానీ, ముందిది చెప్పు——అని రెండుమాట లున్నాయి అంటే చీరలు, నగలు దీల్లో ఏదీ అని నగలా? చీరలా?’

‘ఏంచిత్రాలండీ మీమాటలూ మీరును నగలుంటే చీర్లక్కర్లేదా, చీర్లుంటే నగలక్కర్లేదా రెండూవుండవలసినవే ఈవేళ ఓపేరంటం, లేకపోతే వోపెళ్ళి వొచ్చిందనుకోండి మంచిమంచి నగలు పెట్టుకుని తగిన చీరలేకుండ ఏదో ఓటపేటా చీరలాంటిది కట్టుకుని గడ్డిగొల్లభామలా ఊగిసలాడుకుంటూ తయారైతే ఏమంటారు నలుగురూ? ‘ఈనగలన్నీ ఎరువివ్వో’ అంటారు అల్లాగే మంచిబెంగుళూరు చీర కట్టుకుని నగ లేమీ లేకుండా ఎక్కడకేనా సిద్ధమవుతే, ‘ఎక్కడా ఏంలేవుగానీ ఓచీరొకటి కట్టుకుని, ఏంనీటమ్మా, ఈవిడికీ!’ అంటారు అంచేత ఆడదానికి మాటా మర్యాదా దక్కాలంటే రెండూవుండాలి ’

‘అదంతా సరేలే,’ చేతులో పుస్తకంమీద వేలితో కొడుతూ, ‘రెండింటల్లో ఏదిముందూ అని నేననేది ’

‘నేచెప్పే దేదోచెప్పేను. ఇంతకంటే నాకు తెలియదు ’

# 'అంత అదృష్టమేపడితే రెండూ తీసుకుంటాను నేను'

'పోనీగానీ, నీయెదట ఓగాజుల జతా, ఓపట్టుచీరా ఉన్నాయనుకో ముందేది తీసుకుంటావ్ ?'

'అంతదృష్టమేపడితే రెండూ తీసుకుంటాను నేను'

'అల్లాగేలే, కాస్తంత ఓపిక పట్టేవంటే రెండుకాదు నాలుగు తీసుకుందువుగాని—ఇంతకీ నే నడిగింది చెప్పేవుకావు'

'అయ్యో మీ రొఖలాచెప్తూంటే ఎందుకుపట్టనూ ఓపిక, ఈ కబుర్లు వినివిని చెవులు తడికలుకట్టిపోతున్నాయి అవతల చిట్టి 'అన్నమో'అని గోలెడుతోంది నే వెడుతున్నాను మీకేదినచ్చితే అది రాసుకోండి'

౨

క్రాస్ వర్డ్ పజిల్ సాల్వ్ చేయడంలో, 'పాదద్వంద్వము నేలమోపి పవనుంబంధించి పంచేంద్రియోన్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మారాకు హత్తించి' మరీ ఆలోచిస్తాడు శ్యామలరావు

ఏకబిగిని స్కూల్ ఫైనల్ మూడేళ్లు చదవడంచేత ఇంగ్లీషుభాషలో మంచి పాండిత్యం కూడా కుదిరిందతడికి

గొప్పగొప్పపరీక్ష లేమీ ఇవ్వకపోయినా ఆఖరికి స్కూల్ ఫైనలేనా ప్యాసవకపోయినా స్వశక్తిమీద చాలామంది గొప్పవాళ్ళయినట్టు 'ఆంధ్రభూమి'లో చదివాడతడు

'మనం కూడా గొప్పవాళ్ళం అయితీరాలి' అంటూ ఓగుబులు ఓనాడు అతనిలో పుట్టుకొచ్చింది కాలవగట్టునించి వస్తూవుంటే

మర్నాటినుంచే టైమ్సు ఆఫ్ ఇండియా 'Illustrated Weekly' లు కొనడం పజిల్సు సాల్వ్ చేయడం మొదలెట్టాడు ఎప్పుడేనా తల ఆలోచనలతో దిమ్మెక్కినప్పుడు 'లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె' అంటూ సంగీతం మొదలెడతాడు తుపానులాగ శ్యామలరావు అతడి గొంతుక నాలుగుబుట్టల రాచవుసిరికాయలు తిన్నట్టుంటుంది స్నేహితుల్నికూడా అప్పుడప్పుడు తన పజిల్సులో కాస్త సలహాలిమ్మని ప్రాధేయపడుతూంటాడు అతడు ఊరికే అడిగితే బాగా ఆలోచించరేమోనని తనకు రాబోయేదానిలో మూడోవంతు, అయిదోవంతు వాటాలు కూడా ఎఱ చూపిస్తూంటాడు వాళ్ళకి శ్యామలరావు

'ఆరంభింపరు నీచమానవులు' అనే భర్తృహరి పద్యం నాలుక చివర ఆడుతూవుంటుంది అతడికి పజిల్సు పూర్తిచేయడంలో అతడికి వుండే పట్టుదల చూచినవాళ్ళకి భర్తృహరి పై పద్యం యితడిమీదే చెప్పేడా ఏంచెప్మా అనిపిస్తూ వుంటుంది 'ఏదో ఆలోచించడం' తోచింది రాసిపారేయడం' అనేది అతడిదగ్గిర అనరాదు, వినరాదు ప్రతీది ప్రాక్టికల్‌గా పరిశీలించి నిశ్చయపర్చుకుని మరీ కాగితంమీద యెక్కిస్తాడు అతడు

ఓవారం పజిలులో 'గాడిదలు దీనిని తఱుచు చేస్తూవుంటాయి' అని వుంది 'దీనిని' అంటే దేనినో! అదిమాత్రం ఎంత కొట్టుకున్నా నిశ్చయం కుదరలేదు అతడికి గాడిదలు దొర్లుతాయని అతడికి తెలుసు కాగితాలు తింటాయని తెలుసు పరుగెడతాయని, అరుస్తాయని కూడా అతడి తలలో తిరుగుతోంది అయితే, తఱుచు ఏంచేస్తాయో మాత్రంనిశ్చయించలేకపోయాడు ప్రాక్టికల్‌గా నిశ్చయపరచందే రాయడమెట్లా, ఓనాడు పొద్దున్నే లేచి కండువా పైనవేసుకుని బయలుదేరాడు గాడిదల పరీక్షకి

'ఎక్కడికెడుతున్నారో, చిట్టి పుట్టినరోజుకూడాను యివాళ కాస్త పెందరాళేమాత్రం రండి అన్నానికి' అంది వంటింటోంచి శ్రీమతిగారు

'ఊ! పలికేవు శకునం' అంటూనే ఆవెళ్ళడం వెళ్ళడం ఓచాకిరేవులేమిటి ఓయూనాదాళ్ళ గుడిసెలేమిటి, సందులేమిటి, అవేమిటి, యివేమిటి తిరిగితిరిగి రెండుఝాములకు చేరాడు యింటికి శ్యామలరావు పట్టుదలంటే ఈవిధంగా ఉంటుందతడికి

3

'ఓయ్! నిన్నే! అమ్మద్యా- మీఆడవాళ్ళకి కాసులపేరు మో

# మళ్ళీ నెల్లా ఈరోజునాటికి [illegible]రు నీమెళ్ళో వెయ్య[illegible]పోతే

షైండనీ, చంద్రహారమో మరేదో ఫేషనైండనీ నువ్వన్నట్టు జ్ఞాపకం. నిజమేనా?'

...ఆవలిస్తూ .. 'ఏదో వొహటి. అయినా అవన్నీ యిది చెరిపి అది, అది చెరిపి ఇది పదిమాట్లు చేయించుకునే వాళ్ళకిగాని మనకెందుకు? గుడ్డికంటికి అద్దంతీసినా వొహటే, వున్నావొహటే.'

'ఇంకెన్నాళ్లులే ఈదెప్పులన్నీ. మళ్ళీ నెల ఈరోజునాటికి కాసుల పేరు నీమెళ్లో వెయ్యకపోతే ఏ వొట్టుపడితే ఆవొట్టు. చెప్పు, ఏం కావాలి నీకు, కాసులపేరా, చంద్రహారమా?'

'ఏమిటీ వుప్పెనా! అయిదేళ్లై కాసులపేరు వేసుకోలేక మెడలీపు పెడుతోంది. ఇహ పడుకోండి.'

'నీ వేళాకోళాలికేం గాని, మనలో మనమాట, ఏదేనా మనస్సులోది స్త్రీతో చెప్పందే వుండలేను. చెవి తె[illegible]హంలోనే తాటాకులు కడతావని భయం ..ఈనెలా..'

'మళ్ళీ మొదలెట్టారూ, గాలి మేడలు? నే వినను. నాకు నిద్దరొస్తోంది.'

'ఈవొఖమాటా, విను. మొన్న పజిల్ పంపేటప్పుడు మనలకోటా సిద్ధాంతిగారికి ఓ అయిదు రూపాయిలు పారేసి ప్రశ్నడిగి మరీ పంపాను. తప్పకుండా జయంకలిగి తీరుతుందన్నా డాయన. అందుకనీ...'

'దుర్భిక్షంలో అధికమాసం, యిదొహటా? నామాట వినీ ..'

'ఈమాటు ప్రైజులో రేడియోసెట్టు వొహటి, చవర్లెట్ కారొహటి యిస్తార్ట, ఎవరేనా అవి వద్దంటే మరో అయిదువేలు అదనంగా యిస్తార్ట ఏమంటావు?'

'ఏమంటానా, మిమ్మన్నీ .. పిచ్చాస్పత్రీ . '

వీధులోంచి——

'శ్యామలరావుగారూ! టెలిగ్రామ్. ఇరవై వేలు, లాటరీ.'

'టెలిగ్రామే!...నాకే! ..ఏమేవ్, తగిలిందిచూశావా! కొట్టు, కొబ్బరికాయలు ముందాంజనేయుడికి...'. అబ్బా! వెధవకుర్చీ! మోకాలెగిరిపోయింది! దారిలో పెట్టకపోతే పక్కనేడవరాదూ! . .. ఏదీ టెలిగ్రామ్? చూడినీ! నాకేనా?''

'తమరికే సార్. ఇరవై వేలు-బొంబాయినుంచి. మరి మాప్రజెంటు మాటేమిటి సార్!'

'దానికేంలేవోయ్! ప్రజెం టెక్కడికి పోతుంది! ముందిలాతే? చూడనీ?'

'ఇప్పుడడక్కపోతే మరెప్పుడడుగుతామండీ! పదిరూపాయిలు మామూలు. ముందిచ్చి పుచ్చుకోండి.?'

'అల్లాగేలే, ఇల్లాయియ్యి ముందు ...ఏమేవ్! చూడూ! పది రూపాయి లెక్కడేనా!'

'అయ్యో, పదిరూపాయిలికేం భాగ్యం? తాళాలివిగో మీరే తీసుకోండి.'

'లక్ష్మమ్మగారినేనా, యెవరినేనా బదులడుగుదూ. పొద్దున్నే యిస్తామని ... ఊఁ యిందవోయ్!... అవునుగానీ యీమాటమాత్రం మాలాడ్జిలో వాళ్ళతో వెళ్లి[illegible] అప్పుడే వూదేవుగనక, తెల్లార[illegible]నే వచ్చి కూచుంటారు [illegible] టీపార్టీలంటూ, అవంటూ, యివంటూ.'

'ఎంతమాటా! .. నాకుమాత్రం తెలియదండీ!'

## ౪

'అదుగో, శ్యామలరావు వొస్తున్నాడుగానీ ఎవళ్ళేనా నవ్వేరు సుమండీ, ముందరే ..ఏమిటోయ్, శ్యామలరావ్! ఇంతాలస్యం చేశావేమిటి? మేమంతా యిక్కడ వొఖలా నీకోసం కనిపెట్టుకు కూచుంటే పద, పద, ఈవేళ మైసూర్ కేఫ్‌వాడి పంటపండింది.'

'కేఫ్ మాటానక చూద్దాము కాని ముందా చెయ్యిలా పారేయి .. ఎంతదృష్టమంతులమ్, మేమంతా. నన్ను కాస్త స్పెషల్‌గా చూడాలిసుమా, శ్యామలరావ్! నీకోసం డిక్షనరీలు చూసిచూసి ఎంత తలబ్రద్దలు గొట్టుకున్నానో జ్ఞాపకంవుందా?'

'ఏడిశావ్ లేవోయ్! ఎప్పుడూ మీకు వెధవతిండి గోలే చచ్చు

# ఇంకా హిరణ్యాక్షవరాలు ఎన్ని ఉన్నాయో, అన్నీ రానీ!

టీపార్టీ ఓలెఖ్ఖ, మనబ్రదర్ కి— కావలిస్తే పదిరూపాయిల టిక్కట్లో పదికొని మెడ్రాస్ టూర్ తీసుకెడతాడు మనందర్నీ'

'వెధవమెడ్రాసెవడిక్కావాలి? ఆల్ ఇండియా టూరయితేనేగాని నేనొప్పుకోను'

'మాట్లాడవేమిరా, భాయీ, బెల్లంమొత్తినరాయిలా. అప్పుడే తోక ముడిచేసావా యేమిటి?'

'ఏం తోకముడవడంరా. గంపెడున్నాయ్ దీనితో సద్దుకోవలసినవి· ఈమాటుకు కనికరించి నన్ను విడిచిపెడితే...'

'తేల్చిందీ రంగూ!'

'ఇదేనా స్నేహం.'

'నీకోసం బుర్ర వేడెక్కించుకున్నందు కింతేనా'

'ఇంకా మాఅమ్మాయి పెళ్ళికి నిన్నేమన్నా సహాయం చేయమండా మనుకున్నాను కూడాను, ఆఖరికి?...'

'నన్నేంచేయమన్నావ్రా? నేనూ అనుకున్నాను ఎన్నో, ఇంట్లోచూస్తే ఆడాళ్ళు తోడేస్తున్నారు ప్రాణాలు, కాసూలపేరంటూ ఏమిటో అంటూ.'

'దానికేం లేవోయ్ ఓమూడు వేలు నావి కావనుకుంటేసరి. వాళ్ళ దేవుళ్ళేదో, అయిపోతుంది ఆ పైన మిగతా పదిహేనువే లేంచేస్తావ్?'

'ఈబస్తీల్లో అద్దె కొంపల్తో నాగోలారా! గ్రాసం తనది కాకపోయినా వాసం తనది కావాలిట. ఓకొంప ఏర్పాటుచేద్దామని చూస్తున్నానురా, ఈదోసందులో.'

'ఇంకా హిరణ్యాక్షవరా లెన్నున్నాయో, రానీ!'

'మానాన్న పోతూపోతూ మూడువేలు ఋణం మెడకంటగట్టి మరీ పోయాడు. ఇప్పుడది ఐదువేలై కూచుంది'

'సరే! అంతగా ఏడుస్తున్నావ్ గనుక ఆకాఫీనీళ్లే పోయించు పద!'



'ఏం నవ్వుతావు లేవోయ్, వెంకట్రావ్? ప్రతీదీ తనదాకావస్తేనే గాని తెలియదు.. నన్నుజూసేనా ఆనవ్వంతా, సుబ్బారావ్?'

'నాముద్దే కాకపోతే బెజవాడ దాకా డేకమన్నాట్ట. అయినకాడికి అర్ధరూపాయీ చెల్లించి, నీకేం'

'వాళ్ళతో యేంగాని, బ్రదర్? ఇంతకీ టెలిగ్రామ్ ఎన్నిగంటలకిచ్చుంటారంటావ్? ఏదీ, అదేనా, యిల్లాతే...దీనిమీద టైం కనపడదేం?'

'ఎక్కడో వుంటుందిలేరా'

'కాస్సేపుండరా, వెంకట్రావ్, వెధవనవ్వూ నువ్వూనూ.'

'ఎందుకురా అంతనవ్వు! నా కాల్కట్టు రాలేదనేనా, లేకపోతే, మొదట రావడమే అబద్ధమంటావా, కొంపతీసి'

'ఊరుకోరా, శ్యామలరావ్, వాడితో యేమిటి. పోనీ యెందుకేనా మంచిది మరోమాటు చదివి చూద్దాం'

'ఇదుగో! చదువుకోండిరా, లక్షమాట్లు'

'ఏమిట్రోయ్! శ్యాంభాయీ? ఈరెండోవేపు నేదో రాసినట్టుందేమిటీ! ఎవడుచేసిన పనిదీ! చూడు, చదువు!'

'ఏదీ!.... ఏప్రిల్ ఫూల్'

'హరి, ఎంతపని చేశార్రా!'

---

## దురన్యాయం

పసిగులాబీమొగ్గ
కిదియేల? ఈవేళ
ఈయంధకార బం
ధుర కంథరార్భటుల్లు!
ఏల పిచ్చుకకూన
కీ బ్రహ్మాశరబాధ
ఈ బిధురసంఘాత
మేటి కిటు ఘూర్ణిల్లు!

ఈ మల్లెమొలకకే
ఇన్ని పుర్వులచీడ!
కాకి గణమున కేన?
కలకాల జీవనము.
ఈ హృదయమిట్టు లెది
రించి నిలువకయున్న
కాటిబూదియ మంటి
కౌగిళుల సొక్కదా?

—బి. వి. శింగరాచార్య.

## సర్వసమత్వ మేర్పడినగాని సంఘమునకు మోక్షములేదు

# వ్యక్తులందరు కార్మికులే-
# -ప్రభుత్వమే భూస్వామి

## సామ్యవాదమే సర్వశరణ్యముకాతగినది.

'సామ్యవాదమును చేకొననిచో ఎప్పుడో ఒకప్పుడు సంఘము గొప్పవిపత్తున కూలిపోవును'

"సంఘర్షణ లేర్పడినపుడును, సమ్మెకట్టులు జరిగినపుడును కార్మికుల వేతనములు కొద్దిగా హెచ్చించి యెప్పటికప్పు డుపశాంతిజేయుట శాశ్వతశాంతికి వాయిదా వేయుటయే గాని మరియొకటి గాదు."

రచయిత:

మంతెన సుబ్బరాజు, బి.యే., బి.ఎల్.

సామ్యవాదము వ్యక్తిస్వాతంత్ర్యవాదమునకు కేవలము ప్రతికూలము. ఇది సంఘము తనయార్థిక వ్యవహారములందు సమష్టిసహకారపద్ధతి నవలంబింపవలయునని ప్రబోధించుచున్నది. ప్రతిదేశమునందునను కొద్దిగనో, గొప్పగనో సామ్యవాదోద్యమ మున్నప్పటికిని ఒక్క రష్యాదేశమున దక్క, మరెచ్చటను సామ్యవాదసూత్రములు సంపూర్ణముగా ఆచరణలోనికి గొనిరాబడలేదు. సామ్యవాదసూత్రములు జనసామాన్యమును పూర్తిగా నాకర్షించుచున్నవనుటలో సందేహములేదు. ఐరోపాయుద్ధానంతరము, యూరప్‌ఖండమున నియంతలు బయలుదేరి తమదేశములలో విజృంభించుచున్న సామ్యవాదమును చాలవరకణచివేసిరి. ఇంతమాత్రమున సామ్యవాదము నశించినదనుటకు వీలులేదు. స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వము ఇవియే సామ్యవాదము యొక్క ఆదర్శములు. ఈయాదర్శములను చెడ్డవనుట కెవ్వరి వశమును కాదు. అభిప్రాయభేదము లీయాదర్శముల జేరుటకు మన మవలంబింపవలసిన కార్యక్రమవిధానములకు సంబంధించినవి.

ఈ యదనున సామ్యవాదులు వ్యక్తిస్వాతంత్ర్యవాదము నెట్లు ఖండించుచున్నారో తెలిసికొనుట యవసరము. ఆధునికసామ్యవాదులకు మూలపురుషు డనదగు కారల్‌మార్క్సు అను నతడు వ్యక్తిస్వాతంత్ర్యవాదమును, ప్రస్తుత మాచరణలోనున్న పారిశ్రామిక పద్ధతిని ఖండించుచు నొక గ్రంథమును వ్రాసెను. దానిలో ఆతడు నేటి యార్థికవిధానము భాగ్యవంతుల దౌర్జన్యముపై నాధారపడి యున్నదని వ్రాయుచున్నాడు. ప్రథమములో బలవంతులు దౌర్జన్యముగా బలహీనుల ద్రోసిపుచ్చి, బ్రతుకుదెరువున కక్కరకు వచ్చు మార్గముల నన్నిటిని స్వాధీనపరచుకొని తమయాస్తులుగా చేసికొనిరి. భుక్తిని ప్రసాదించు భూమియంతయు ఈవిధముగా బలవంతుల స్వాధీనమాయెను. అందుచే వారు భాగ్యవంతులైరి. సకలవస్తువులు నుత్పత్తిచెందుటకు స్థానభూతమగు భూమికి మారులగుటచే బలహీనులకు వారికాయకష్టముతప్ప బ్రతుకుదెరువునకు వేరుమార్గము లేక పోయెను. వీరు తమకాయకష్టమును వచ్చినంతవరకే బలవంతుల కమ్ముకొని జీవించవలసిన యగత్య మేర్పడినది. ప్రభుత్వము భాగ్యవంతుల స్వాధీనమునం దుండుటచే కార్మికులపరిస్థితి మరింత ఘో

ముగా నుండెను. ఈవిధముగా సంఘము- భాగ్యవంతులనియు, బీదలనియు-రెండుగా చీలిపోయెను. ఈ చీలిక ప్రభుత్వము లవలంబించిన వ్యక్తిస్వాతంత్ర్యవిధానముచే నంతకంతకు పెద్దదై క్లిష్టపరిస్థితుల గల్పించుచుండెను. భాగ్యవంతులంతకంతకు నెక్కుడు భాగ్యవంతులగుచుండిరి. బీదలు నట్లే నంతకంత కెక్కుడు బీద లగుచుండిరి. ఇట్లీరెండుతరగతులు నొకదానికొకటి మిక్కిలి దూరమై పోవుచుండెను.

దరిమిలా, ౧౮-వ శతాబ్దిలో వచ్చిన ఫ్యాక్టరీపద్ధతులచే బీదల పరిస్థితి మరింత దుర్భరమాయెను. ఫ్యాక్టరీలు రాకమునుపు వీరందరు ననేకవిధములగు చేతిపనులచే పొట్టపోసికొనుచుండెడివారు. ఫ్యాక్టరీలు వచ్చుటతో గృహపరిశ్రమలన్నియు పూర్తిగా నశించెను. చేతిపనులు చేసికొని జీవించువా రందరు నిరుద్యోగులై కూలికొరకు ఫ్యాక్టరీలచుట్టు మూగసాగిరి. ఈకూలీల తండోపతండముల జూచి ఫ్యాక్టరీ యజమానులు కూలికి బేరము పెట్టసాగిరి. సాధ్యమైనంతవరకు కూలిని తగ్గించుటయే పెట్టుబడిదారుల పని. ఫ్యాక్టరీపనికి పోటీ యెక్కువగుటచే కార్మికుడు పెట్టుబడిదారుని బేరమునకు లొంగిపోవలసినవా డాయెను. పెట్టుబడిదారులు ముందు గొప్పలాభములను పొందునుద్దేశ్యముతో కొంతకాలమువరకు ప్రస్తుతలాభములను వదలుకొనగలరు. అనగా, తమఫ్యాక్టరీలను మూసి యుంచగలరు. పాపము, కార్మికునిస్థితి యట్టిది కాదు. ఏరోజున కారోజు తనకాయకష్టము నమ్ముకొని జీవించవలెను పని లేని పూట పస్తుండవలసిన దే. ఇట్టి పరిస్థితులలో పెట్టుబడిదారులకును, కార్మికులకును మధ్య సరసమగు ఒడంబడిక లెట్లు చేకూరగలవు? ఆపూటకు తిండికి లేని కూలివానికి వ్యక్తిస్వాతంత్ర్యమువల్ల ప్రయోజనమేమి? కడుపునిండి కూర్చున్న ఫ్యాక్టరీయజమానియెదుట నీగర్భదరిద్రుని బెట్టు ఎంతసే పుండగలను? యజమాని కొంతకాలము వరకు తనవ్యాపారమును కట్టిపెట్టినను మించిపోయిన దేమియు లేదు. అట్లు కార్మికుడు తనయాకలిని కట్టిపెట్టగలడా? కట్టిపెట్టినను ఎంతకాలము కట్టిపెట్టగలడు? ఈ కారణములచే కార్మికులు ఇచ్చినంతవరకే పుచ్చుకొని పలుకష్టములబడవలసినవా రగుచున్నారు. ఈ విధముగా భాగ్యవంతులు బీదలను కొల్లగొట్టుచున్నారు. బీదలు చెమటూడ్చి యుత్పత్తిజేసిన ధనధాన్యములను, వస్తువాహనములను, సర్వము గట్టుమీదగూర్చున్న భాగ్యవంతులు దిగమ్రింగుచున్నారు. పేరునకు వ్యక్తిస్వాతంత్ర్యమేగాని, నిజమున కది బీదల బానిసత్వమే యగుచున్నది. కలవారియెదుట లేనివారికి వ్యక్తిస్వాతంత్ర్యమువలన ప్రయోజనము లేదు. నానాటికి బీద లెక్కువయగుటచే కూలికి పోటీ యెక్కువయగుచున్నది. దీనిచే కూలికి తగ్గుదలయేగాని పెరుగుదల లేదు.

ఇక పెట్టుబడిదారుల స్థితిని దీనికి పోల్చిచూచెదము. కార్మికుడు తన కాయకష్టముచే ప్రతిదినము కొన్ని వస్తువులను తయారుచేయుచుండును. అట్లు తయారగు వస్తువుల-విలువ కార్మికుడు పొందు కూలికంటె ఎన్నియోరెట్లు మిగిలియుండును. ఈలాభ మంతయు ననవసరముగా, నక్రమముగా, నన్యాయముగా పెట్టుబడిదారుడే తీసికొనుచున్నాడు. ఉత్పత్తిజేయు ప్రతిపరిశ్రమయందు నీయన్యాయము జరుగుచున్నది. ఫ్యాక్టరీపద్ధతులవలన ఉత్పత్తి శీఘ్రముగాను, ఎక్కువగాను జరుగుటచే పెట్టుబడిదారులు బ్రహ్మాండమయిన లాభములను బొందుచున్నారు. కార్మికులుమాత్ర మాపొట్టకు చాలియు చాలని కూలితో మాడిపోవుచున్నారు. ఈ విపరీతపరిస్థితి మన ముపేక్షవహించినయెడల ఎప్పుడో యొకప్పుడు సంఘమును గొప్పవిపత్తున ద్రోయకపోదు. అట్టి విపత్తును రాకుండ జేయవలెనన్న సంఘమున భాగ్యవంతులు బీదలు నను తారతమ్యమును దొలగింపవలెను.

అదియును గాక వ్యక్తిస్వాతంత్ర్యపద్ధతియందు కాయకష్టము చాలవరకు వృథామైపోవుచున్నది. అనగా, సంఘమునకు నిరుపయోగమైన పనులకు వినియోగింపబడుచున్నది. పరిశ్రమలలోను, వ్యాపా

రములలోను పోటీ యెక్కువగుటచే ప్రతివ్యక్తి తనపరిశ్రమను, లేక వ్యాపారమును ముందుకు తీసికొని వచ్చి గొప్పలాభములను పొందవలయునని చేయు కృషియంతయు, సంఘమున కవసరముగాలినపనియే యగుచున్నది.

పై విమర్శయందు సత్యము లేకపోలేదు. వ్యక్తిస్వాతంత్ర్యవిధానము సంపూర్ణముగా నవలంబించిన యెడల సంఘ మధోగతిపాలగుట కెంతకాలమో పట్టదు. ఈ విషయమున నభిప్రాయభేద ముండనేరదు. అందుచేతనే, ప్రతిదేశమునందును ప్రభుత్వము వ్యక్తుల యార్థికవిషయములందు జోక్యము కలిగించుకొనుచున్నది. నేడు మనము గాంచెడి ఫ్యాక్టరీచట్టములు, కార్మికచట్టములు మొదలైనవన్నియు వ్యక్తిస్వాతంత్ర్యమునకు విరుద్ధములే. సామ్యవాదులదృష్టిలో నీ చట్టము లన్నియు తాత్కాలికోపశమనములే గాని శాశ్వతచికిత్సలు కానేరవు. సంఘమున- భాగ్యవంతులు, బీదలు-అను విషమతారతమ్య మట్లే నిలిచియున్నది. ఇట్టి తారతమ్య మున్నంతవరకు సంఘమునకు శాంతిగలుగనేరదు అంతవరకు నీరెండుతరగతుల మధ్య సంఘర్షణతప్పదు. ఈతారతమ్యము నశించి సర్వసమత్వ మేర్పడినగాని సంఘమునకు మోక్షములేదు. సంఘర్షణ లేర్పడినపుడును, సమ్మెకట్టులు జరిగినపుడును కార్మికుల వేతనములు కొద్దిగా హెచ్చించి యెప్పటికప్పు డుపశాంతిజేయుట శాశ్వతశాంతికి వాయిదావేయుటయే గాని మరియొకటి గాదు. సమ్మెకట్టులు, సంఘర్షణలు, విప్లవములు మొదలైన వెన్నో జరిగి, యెంతమందో నశించిన వెనుక, యెంత ధనమో వ్యయమైన వెనుక తొందరపడుటకంటె ముందే దూరదృష్టితో పరికించి సవరణచేసికొనుట ఎన్నియోరెట్లు మేలు. కావున సంఘమున నీతారతమ్య మవశ్యము తొలగించవలయును. ఈతారతమ్యమును తొలగించుటకు సామ్యవాదు లొక్కటే మార్గము గలదని చెప్పుచున్నారు.

అది యెట్టిదో విచారించెదము. దీనినే సామ్యవాద నిర్మాణకార్యక్రమ మనుచున్నారు. భాగ్యవంతులు, బీదలు నను విషమతారతమ్యము నశించవలె నన్న, శాశ్వతశాంతి యేర్పడవలె నన్న, సంఘము సమష్టిసహకారపద్ధతి నవలంబింపవలెను. దేశమున ఉత్పత్తికి సంబంధించిన పరిశ్రమలన్నియు ప్రభుత్వవశమై యుండవలెను. వ్యక్తులకు కట్టుకొను వస్త్రములు, పరుపులు, పాత్రలు, తిండిదినుసులు మొదలగు యింటిసామానులు, ఇల్లు, కుటుంబము తప్ప వేరేసొంత ఆస్తు లేమియు నుండగూడదు. ఉత్పత్తికి సంబంధించిన భూములు, ఫ్యాక్టరీలు, గనులు, సర్వము ప్రభుత్వమే స్వాధీనపరచుకొని కార్యమును నిర్వహించవలెను. ప్రభుత్వమునకు మినహా సంఘమున పెట్టుబడిదారు లుండకూడదు. వ్యక్తు లందరు కార్మికులే. ప్రభుత్వమే భూస్వామి, ధనస్వామి, పెట్టుబడిదారు. దేశమున నీవిధముగా ఉత్పత్తియైన వస్తువులను వ్యక్తు లందరికి సమానముగా ప్రభుత్వమే పంచిపెట్టవలయును. ఇట్టి పద్ధతిచే దేశమున ఉత్పత్తి వృద్ధియగును; సర్వజనులకు సమృద్ధిగా ఆహారము లభించును; సౌఖ్యము చేకూరును; సౌభ్రాతృత్వము, సమత్వము నేర్పడును; శాశ్వతశాంతి గలుగును.

ఇదియే సామ్యవాదుల కార్యక్రమము. సామ్యవాదులలో కూడ రెండుమూడు తెగలవా రున్నారు. పై పేరాలో తెల్పిన కార్యక్రమమును గలిగినవారు సామ్యవాదులలో తీవ్రవాదులు. వీరినే సమష్టివాదు (కమ్యూనిస్టు) లందురు. వీరిలో మరికొందరు వ్యక్తు లందరికి వారికష్టమునకు సమానజీతము లేర్పాటు చేయవలె నని చెప్పుచున్నారు. ఈ పై వాదన కెదురువాదన ఎట్టిదనగా:— సొంత ఆస్తులులేని సంఘమున వ్యక్తికి పనిచేయవలె ననెడి ఉత్సాహ ముండదు: ప్రతివానియందును సోమరితనము బలసిపోవును. తుదకు పరిశ్రమ లన్నియు క్షీణించి దేశమున ఉత్పత్తి కూడ తగ్గిపోవును. సొంతఆస్తులు లేకపోవుటచే, వ్యక్తి తన శక్తిసామర్థ్యములను, తెలివితేటలను పూర్తిగా వినియోగించడు. కావున, పనిలో చాకచక్యము, నైపుణ్యము నశించును. ఈవిమర్శకు సామ్యవా

దులసమాధాన మేమనగా సమష్టిసహకారపద్ధతియందు పనిచేయు కాలమును చాలవరకు తగ్గించుటకు వీలగును. అందుచే, పనియందు విముఖతగాని, విసుగుదలగాని యేర్పడదు. ఇట్టిది పోటీలతో పెనగులాడు పెట్టుబడిదారుల రాజ్యమున సాధ్యము కాదు గాని, కార్మికుల రాజ్యమున సాధ్యము కాగలదు. అదియునుగాక, సామ్యవాదసంఘమున నేర్పడు సోదరభావము, సహకారసఖ్యతలు, సంతృప్తి అట్టి సోమరితనమును, సంకుచితస్వభావమును పారదోలగలవు.

సామ్యవాదులలో మరియొక తెగవారు పై విమర్శను తప్పుకొనుటకు మరియొక పద్ధతిని చూపుచున్నారు. ఇందు వ్యక్తియొక్క శక్తిసామర్థ్యములను బట్టియే జీతములు నిర్ణయింపబడును; ఉన్నతస్థానముల కర్హత యేర్పడును. తక్కువ పనిచేయువాడు తక్కువ జీతమును బొందును, ఎక్కువ పనిచేయువా డెక్కువ జీతమును బొందును. కాని, తక్కువ జీతము కూడ, వ్యక్తి సామాన్యజీవితావసరములకు మించినదే యుండును. ఈ పద్ధతి, పై ప్రభుత్వోద్యోగులు నిష్పక్షపాతులై, న్యాయమును పాలించువారైనయెడల చక్కగా పనిచేయగలదు. కాని, లంచములు బట్టుట, పక్షపాతము వహించుట, స్వలాభములుగోరుట మొదలగు దుర్గుణముల కీయుద్యోగులు లోనైనయెడల వ్యక్తులకు తీరనినష్టము సంభవించును.

మరియొక తెగవారు సంఘమును దేశమునం దెన్ని పరిశ్రమ లున్నవో అన్ని భాగములు చేయవలెననుచున్నారు. వ్యవసాయదారులందరు కలిసి యొకసంఘముగా నేర్పడి వ్యవసాయపరిశ్రమను సాగింతురు. ఇట్లే నేతపనివాండ్రందరు కలిసి నేతపరిశ్రమను, గనుల పనివాండ్రు గనులపరిశ్రమను కొనసాగింతురు. ఈకార్మికసంఘములన్నియు ఒకరివస్తువుల మరియొకరు మారకముద్వారా పొందుచుందురు.

మొత్తముమీద, సామ్యవాదమొక్క రష్యాదేశమున దక్క, మరెచ్చటను సంపూర్ణముగా స్వీకరింపబడి యుండలేదు. రష్యాదేశమున సమష్టిసహకారపద్ధతి చక్కగా కొనసాగుచున్నదని మాత్రము చెప్పవచ్చును.

—నమ్మాళ్వార్సు నూతనముగా ప్రచురించిన 'రాజకీయశాస్త్రము'నుండి.

౪౩౨ పేజీ తరువాయి.]
లోనే అందుకొని రాయుడు

'ఇదేమిట్రా వీడు పాడటం మొదలెడ్తాడా ఏం,- కవిత్వం! చస్తాం' అన్నాడు.

'ఇతని పాటకి, అభినయం అంగమే కదా. మార్వాడీనృత్యానికి, కనుపడనితాళం, నేనుంటాగా' అన్నాడు మర్చంటు.

'వీడికీ తెల్సురా. మొదణ్ణించీ పల్కుకుంటావేం?' గోపాలుని ప్రశ్న.

'కానీ, ఎంత చెప్పకుంటే అంతనయం ముందుకి; విజ్ఞానం వృద్ధిఅవుతోం దన్నమాట' అన్నాడు నారదుడు.

'ఉండ్రా చెప్పమంటారు. మళ్ళా ఉపాఖ్యానాలూ మీరున్నూ... లేడిని కడుపులో, మాంచి చలాకీ నిలబెట్టుకొన్న అర్ధచంద్రవంక, గోహిణీఫిల్ముల, గుర్తూ. ఆవనసూలి- గోపాలుడు- మురళి. దైవభక్తిసూచన ఆరంభం. ఆ తారాగణం?' అన్నాను.

'ఉండుండు. ఎవ రేవేషం వేశారంటావ్' అన్నాడు గోపాలుడు.

ఓకాణీకో, అర్ధణాకో, గృహలక్ష్మి పుస్తకం అమ్ముతూంటే వీడికి అన్నీ తెరమీది కెక్కించాలిరా' మర్చంట్ సహజధోరణి.

'హారతి యిస్తూన్నరాధ. ఓచేతిపై చెయినానించి- చాలాముగ్ధ. ఆపాటలో భక్తి...'

'చాల్లే కవీ! ఏమిటీ ఒక్కపలుకైనా తెల్సిందా అంటాను' అన్నాడు గోపాలుడు.

'శబ్దగ్రాహకుడూ, ఆకోబ్బరిచెక్కలూ, పళ్ళూ మాసుకోండోయ్. నైవేద్యం! అనుకొని ఉంటాడు' అంటూ నారదుడు అన్నాడుకదా. 'శాస్త్రి బొండు కుర్రాణ్ణి రప్పించారెందుకురా గృహలక్ష్మి గారింటికీ'అని.

'ఆఁ ఎందుకా? వెకిలి తిండిబోతు బ్రాహ్మణ్యం పొట్టలూపాలనీ! అదిల్లా ఉంచు, ఆ అరవవైఫ్‌తో, కుచేలసంతానాన్ని డాక్టర్, హాస్పటల్లో యితరజనానికి ఖాళీయివ్వకుండా చేర్చడం, నీకు వచ్చిందా' అన్నాడు మామర్చంటు.

'నన్ను చెప్పనిస్తేగా! కవీ, విమర్శకుడూ, నటకుడూ, దర్శకుడూ, అన్నీ మీరే అయిపోతే!' అన్నాను.

'అదేమిట్రోయ్! ఓవిసురు మామీదికే! ఇన్నిఫిల్ములు చూసాక, నువ్వే చెప్పాలేమిటి? వద్దనడానికీ కద్దనడానికీ నువ్వెవతెవే అనేస్తావు కాబోలు' అన్నారు ముగ్గురూ తలోమూలానూ.

'కానీండర్రా! ఇప్పుడు ప్రతివాని విమర్శనా, పాటికి రావల్సిందే. ఏదో కొంత ఆహారం మెదడుకి ..గోపీ, మాల సేవకాదు. మానవసేవ! అంటాడు; ఎంతహృదయాన్ని కదలిస్తూంది' అన్నాను.

'మాధురి యిదేనా' అంటుంది పిల్ల కూడా, ఆహ్వానాన్ని చూసి- క్యూరియాసిటీలే-, అసలు హరిజనసేవాసమితిసహాయార్థం భోగంపడుచు నాట్యంకావల్సొచ్చిందేం?' అని శంకించాడు గోపాలుడు.

'ఉండరా కవీ! నేచెప్తాను. కథా, అసలు. దానికి ముందురాబొయ్యే తతంగానికి, ఉపక్రమణిక చేయించారు. గొప్పఅయిడియల్ కి సమన్వయిస్తుందా లేదా అని చూసారూ?' మర్చంటు సమాధానం.

'హరిజన బాలికల నృత్యమే పెట్టాల్సింది; ఓపట్టాన్నదే ఆకర్షణో నేమో! ఆబాలికచే పూలుచల్లించారు సభ్యులపై; సాంప్రదాయానికి గుర్తు. భారతమాత చిత్రం, ఆస్తవం, విషయానికి తగ్గట్టు ప్రదర్శించారు,' అన్నాను.

౨

'నాట్యం చెప్పవేం?' అన్నాడు అంతలోనే నారదుడు.

'చెప్తున్నా గా. ఆగోపికల బాలు, సాగిపొయ్యాక, జలకలశంతో ఉన్న రాధవస్తే- అవులే- అదొకప్రదేశం. ఆ నాట్యభంగిమాలూ, కలరుతాలూ, విన్యాసవీచీమధురిమల్లో ముడుచుకు మడతలు వడ్డ, తేనె బరువుల విరహక్షేత్రాంచలము త్తెపుకోవల్ని అల్లాగల్లాగ విదలించి, మురళీధ్వనికి ఉలికే కోర్కెలలో ఒళ్లు తెలియని అలసటకుగులలో, కూన్యాల లోకి చొచ్చుకుపోయిన రాధికావిగ్రహం...'

'ఆఁఆఁ కవిత్వం అపుఁ నటన చెప్పు' అని జ్ఞాపకపర్చానంటాడు మర్చంటు.

'అదేనోయ్! అధ్యక్షుడు, మాధురి- అనటనాళిలి- 'అనతికాలంలో నే అధిక ప్రశంసాపాత్రమౌతుం' దనే పలుకులలో, పురోభివృద్ధికి దీవనలర్పించాడు' అన్నాను.

'ఈకథామాలలో ,నాదీవెలుగూ'అన్నట్టు అశాస్త్రిగా డేమిట్రా? చాలా కాన్‌స్పిక్యూస్‌గా ఉండే ఆకారెక్టర్ వివిధ వేషాలూ' గోపాలుడు ఆలోచన్లో పడ్డాడు.

'మార్వాడీ- శాస్త్రి, ప్రథమపరిచయం-బహుశా దృశ్యాన్ని బట్టితో చేదదే- లోనే లంచం. డబ్బు గుంజటం, ఎదురు తెచ్చుకోటం, వెన్నతో నేర్పి, భోగం వారికి పారనిర్ణయకర్త ఐపోతాడు. ఆ కోటూ, ఆసిగరెట్. అబ్బే, పౌరోహిత్యం...' అన్నాడు కొలంబస్‌లా అచ్యూత్.

'గహలక్ష్మి, గృహకృత్యాలలో, సగబాలుకు సంతసంకూర్చే, పిల్లల ముద్దుమురిపాలూ, దుస్తుల అలంకరణాలూ, వికసించిన ముఖకలువలలోని చల్లందనాలూ, ఆడాక్టర్ హుషారీ యీలా. సరిగ్గా ప్రక్కవాయిద్యం, వీణా మేళవింపులలో కరిగిన రాధామూర్ఛనలూ, ఆంధ్రగృహాల,ఆనందాన్ని ఎఱుకపర్చవూ?' అన్నా.

'పర్చకేం, వీణపలుకు ఒదుగులలో, ఏకసంతగ్రాహిత్వం ఉంది. 'ఎక్కుమామా' పాటవీధులలో, నేవిన్నట్టే, కోత హృదయాల హత్తుకుపోయిన డాన్సు పాట అభినయింపించింది. ఆంధ్రగృహాలకు, సినీమా, నాటక నృత్తగానాలే,

జీవితపారంలో తొణికసలాడే రక్త ఘోంఘులు’ అన్నాడు నారదుడు.

‘అసలు నువ్వే నారదుడివిరా, రాయుడూ! అభినయమన్నా, గానమన్నా కరగిపోతావు. ఇప్పుడిప్పుడు కవిత్వంలో కరకుశ్ర్కశ్రేట్టున్నావు! రాధాకృష్ణుల అతిలోకప్రేమ లోతుల్ని, గానలహరిలో, పూలమాలలో కొసల దూసుకొన్న తంతువైన, యీగృహలక్ష్మి, అంచులు మోసిన తీపి బ్రతుకును రాగరసంలో వెలువరించుట సమంజసమే, అంటాను’ అన్నాను ధీమాగా.

‘నటనప్రేమ’ అంటాడుగదా డాక్టరూ, ఆ, ఆస్పత్రిలో, సిరా చేతిపై పోసిన ఆసరసం నటనప్రేమనా?’ అని అడిగాడు అచ్యుత్.

‘స్వాభావికమే అనుకుంటానోయ్’ అన్నాడు గోపాలుడు.

‘రైటో! మాధురి,- కొంటె, చిలిపి, కనుగిలికింపులు మాసావ్; కొంతా అప్టే, ఆ చల్కాకీకి తాగుతుందా, నెవ్వర్ అంటాను’ అన్నాడు నారదుడు.

‘ఊరుకోవురా, రాయుడూ? నీధ్వనీ- నచ్చలేదు’ అన్నాను.

‘ధ్వనీ! ఏమమ్మా. ఉన్నామనిపించారూ!’ మర్చంటు నొసలు మాత్రం వెక్కిరించినట్లున్నయి-

‘అన్నట్టూ. హహ్హాహ్హా హ్హో. ఆవశీకరణంమంగు! మార్వాడీ, ఏమిటా అల్లరీ? నాట్యానికి మధ్యగా తెరపై యడ్వర్టైజుమెంటా?’ గోపాలుడు అడిగాడు.

‘ఏం, వ్యాపారానికా? ప్రత్యేకం సంఘుదుర్నీతుల్నే అణచడానికనుకున్నావా?’ అని మందలించాడు నారదుడు.

‘అసలు ‘అమృతప్రాశ’ తినే అలవాటుంటే యీముసలితనపు భయం వుండేదా ఆసేట్ కీ?’ అని తన చాతుర్యానికి నవ్వుమొగం పెట్టాడు మర్చంటె.

చాల్లేవోయ్! ప్రతిమాటకీ, పనికీ, నువ్వూ, నీకంపెనీ, ఎల్లాగో యిరకడమేనా?... మాధురి, రోగాన్ని, ఎంతచక్కగా అభినయించిందంటావు? కృత్రిమాభినయంలో, కోర్కెలు తీరుతోన్న సంతసం మెఱిసిపోలేదూ’ అన్నాను సాఫీగా.

‘అదంతా ఆపిల్లకేం తెల్సు ననుకొనే, శాస్త్రి, పన్నాగం ప్రథమంలోనే చెప్పాడాయిరీ’ అని విఱిచేసాడు నారదుడు.

‘అబ్బా, మళ్ళా ఆ సుందోపసుందులు,- అజిడ్డుగాళ్లు, ఆ అరవవలలాంకవేషధారులు,- వాసినచుట్టిన ఆవకాయకుండలు.- కారుటైర్లలో గాలిపోగొట్టేమిషా!? మాధురి యింటి పియానా వాయిద్యాన్ని విని డాక్టర్ మళ్ళా మేడెక్కడానికేనా?’ గోపాలుని సందేహం.

‘ఎన్ని చదివావురా నీదుంపతెగా! నిజంగా, ఆడాక్టర్ లేట్‌గా యింటికొచ్చాక, చేసిన- ప్రథమంగా- తప్పకి గొంతుక నుబికివచ్చే బ్రాందీ, మత్తు నణచుకొని, తన ప్రేయసికి తెలియనీకుండాలని కమ్ముకున్న ఆహృదయారాటం ఎంత చక్కగావుందీ!’ అన్నాను.

## 3

ఇన్సూరెన్సువాలా ఘడియారంవంక చూసాడు. మాకందరికీ ద్వారావృత్తిగా కాఫీ మళ్ళా పట్టించాం. నారదుడు ఒక టీ-రెండూ, స్టెప్సులో మెట్లుదిగిపోయాడనుకుంటూ, వీధిలో వాని వాహనం ఆతన్నెక్కించుకున్న బఱువుకి మూల్గింది.

‘వీడికి కాలు నిలుస్తుందిట్రా’ అన్నాడు మర్చంటు.

‘కవిగారు కిస్తీలల్లో వున్నారన్నారు?’ అంటో రత్నం ప్రవేశించాడు. ఇతగాడికి కొంచెంకష్టమే నాలుగుమెట్లైనా ఎక్కిరావటం! ‘ఉత్తరాన్ని హిమాలయాలుండటం, దక్షిణాన్ని నాబోటిగాళ్లుండటం మూలాన్నేకాని, లేకపోతే యేనాడో బాలెన్సుతూకం సరిపోక, చాపలా చుట్టుకుపోయివుండేది యీభూమి’ అంటోంటాడు.

‘ఒహో! ఆదాకథా, అమావాస్య, లేకపోతే, కొట్లో తివాసీలన్నా అరిగిపోవాలికాని, లేవనివాడవు యిల్లా గెందుకు వస్తావు?’ అన్నాను. నాకు యీతడు ‘బావ’ వరసాయెను!

‘మీ భావగారు నిన్న ఫస్టుషోకి వెళ్లొచ్చారయ్యా! ఇక భట్రాజైపోయాడు. పూర్వం భట్రాజులే కవిత్వంలో కైవారాలు చేసేవారట!’ అన్నాడు గోపాలుడు.

‘అసలు గుండె అక్కడేవుందో ఏమో కనుక్కో’ అన్నాడు మర్చంటు.

‘అన్నింటికేంగాని, ఆ పిక్చరింగు నిన్న మొన్న, మనంపడ్డపాట్లని, కళ్ళకు దుపెట్టింది’ గోపాలుడు. అతడు నానకొఆపరేటర్.

‘అసర్వాంతర్యాములు శాస్త్రిగారూ, బావమరదీ, గోపీ, కంటె ముందే సిద్ధమయ్యారే, కల్లుపాకవద్దకీ’ అన్నాడు అచ్యుత్, రత్నంకేసి వారగంటచూస్తూ.

‘నేనున్నాననైనా, లేద, మీవెక్కిరింపులకీ... ఆపురుషవేషంలో మాధురి, ఏమిట్రా వికారం- జుత్తు టోపీలో పడలేదు, తొంగిచూస్తూనేవుంది. నడక, మాట, స్త్రీత్వానికి దూరంగాలేవు. ఇంతకీ, డాక్టర్ని మోసగించడానికి,- గుండెదెబ్బతిన్న మనిషిని చూడాలనే, పిలుపు అందమైనదే అనుకో, యిదేంసాకు?’ రత్నం పరీక్షకి ఆరంభించాడు.

‘చెప్పవల్సిందోటుంది. అభోగంవారింటి చేష్టలూ, ఆపైని ఆడాక్టర్, మాధురీల, దేహాలు గుఱ్ఱూ, బహుశాప్రేక్షకజనంగళ్‌ని, నీతిపంథాకు మరల్పక మెల్లగున్నా... సంపెంగ చేతిలో నలిపితేనే పరీమళం అనుకొని జేష్ట...’ గోపాలుని అర్థోక్తిలోనే.

‘టూమచ్ లే’ అన్నాడు మర్చంటు.

‘ఆతలావుమనిసీ- గోపి- తాగితూలే డాక్టర్ లెంపకాయకే చాపచుట్టగా పడ్డాడేనిరా?’ గోపాలుడు రత్నం వీపుపై తట్టాడు.

‘కొడ్తా... డ... ను... కొన్నా-డూ?, రత్నం నంజేస్తూ మాట అన్నాడుకదా.

‘సరేగాని, అర్ధరాత్రి రాధ ఏమిటూ పా

టితో ఏడుస్తుందీ? అవ్యక్తంగా?' అని.

'నువ్వా! ఏడ్పుపద్యాలెన్ని రాయటంలేదోయ్' అన్నాడు పెకేలున, నాకేసి చూసి మర్చంటు.

'చాల్లేరా, వేళాపాళాలేని వెటకారం! మార్వాడీసరసంలాగేవుంది' అని నాకు తామరాకు వీవనవిచాడు గోపాలుడు.

'చూడు. గృహలక్ష్మిగా, ప్రథమ ఘట్టంలో కన్పడ్డ రాధ వయస్సులోనూ, ఆకారంలోనూ, లేతతనం వున్నా కష్టాల చారికలుకట్టి, నిద్రలేని రాత్రులు వెళ్ళబుచ్చుతూ, ఏడ్చి నవసినా, అంత వలం అయిందేం బావా' అన్నాడు రత్నం.

'అరిపిడి తన్నాదియ్యా! బెనారస్ చీరలలోనే గాకుండా ఫిలుం బాగోగులు కూడా తెల్సల్లేవుంది వీడికి, ..ఆత్రిప్పటం వర్తకానికి- కొట్టొక్కడే కాదూ లోకం!' అన్నది చూపించుంటాయి, ఏ పరాకునో...ఓహో! కవికి కోపంవచ్చిందర్రా, ఒరే అచ్యుత్ చెప్పు' గోపాలుడు మర్చంటు మొఖంపై ఘూమ తెర పోనిచ్చాడు.

'రిసెర్చికి, కెమేరా మేన్‌కో, డైరక్టర్ సాబ్ కో పంపాలి, విషయం'అని ఆలోచన్లో కళ్ళు తేలేశాడు అచ్యుత్.

'బ్రాందీసీసాతో కొట్టిన ఎంతసేపటికీ పడిపోవటం రాధ?' అన్నాడు మళ్ళా రత్నం.

'మీకు తోచటమేనా లేక విషయం గ్రహింపుంవా? సినిమా, ప్రదర్శనం, ఆ విషయాన్ని మరుస్తారేం? దెబ్బ తిన్న రాధ, దిమ్మతిరిగిపడ్డ రెండోఫోటో మారుటలో కాలవ్యత్యాసమా?' అన్నా పట్టలేక.

'ఆ రేడియోపాట, రాధకి విచార కార్మోగులలో, మెఱుములాగై పోలేదూ' అన్నా వెంటనే-

'మనకేం తెలియకపోయినా- డాక్టర్ గారింట్లో రేడియో సెట్టున్నట్టే వ్వడదే,- బహుశా అదివరకే యీపాటకి సిద్ధంగా- వినపడడానికి- అరేంజి చేసుంచిందేమో రాధమ్మ' కళ్లు కిందకి పెట్టి కోరచూపుల్లో గోపాలుని మాటలు.

'సౌందర్యఘట్టాలే కానరాలేదటర్రా మీకూ? మాధురీ కేశవాగురలూ, ఆనాగ వృత్యం, ఆసమయానికితగ్గ ఉచితదుస్తుల రీతీ, విశేషం. ఆ అభినేత్రి పురోభివృద్ధి సూచనకి మచ్చుముక్కలు కావూ?' తీపి కలలగన్న బరువుపలుకులలోని నా పలుకులు.

'వీడికి కోపంవచ్చిందంటావూ? ఆ తండ్రి మరణావస్థఘట్టాలు, బిళ్ళగుంగళునినాటి యితివృత్తాల పాత ఉసిరి పచ్చళ్లు అంటాను' అన్నాడు మర్చంటూ.

'ఎమిట్రా ఆరాగం!- మామగారు గతించాక రాగ ఏడ్పుకదూ? పిల్ల బిక్క మొఖం, తాత గార్ని కూర్చి అడగటం, సహజంగా నే ఉందిలే' అన్నాడు రత్నం.

'ఏమో మద్దెలలాంటి మనిసీ! నీకే తెలియాలి- రాగపిపాసివికదూ!' అన్నాడు గోపాలుడు.

'అసలు విశ్వాసరావు, మాధుర్ని- చెయ్యిచేసుకోకపోతే, డాక్టరు పిస్టలు తీస్తాడా...' మర్చంటు సందేహం.

'సరే. యీకథేలేను. మనకెక్కడ జౌననీ, కాదనీ, యింతయిదీ లేదు' అన్నాడు రత్నం.

'పారిపోయే ఆ డాక్టరు, గోడపక్కదాక్కుంటే, ఓపోలీసువాని చూపు, యీపక్కకే పడింది! అయినా వాడు రెండోపక్కకే పొయ్యాడు, డైరక్షన్ ప్రకారం' అన్నాడు యిన్సూరెన్సువాలా.

౪

మాఖబుర్లల్లో, ఆగకుండా ఘడియారం మాత్రం గంటతర్వాత గంటదాటి పోనిస్తూనే ఉంది. పేపరుకుర్రాడిపిలుపుతో గుదులేట్టినకాళ్లకు ఓ రెండునిముసాలుపనీ. పేపరు బల్లమీద పడేసి.

'అంతా అదేనా ఏమిటి మీకళ్లకు కట్టుతః? రాధను ఆడాక్టర్ అనేమాటలకు, మాధురికళ్లలో వెలిగే, జ్యోతీ, ఆనైశిత్యం, ఏహ్యం. ఎంత సహజమై పోయ్యాయా మెరుకు? అదల్లా ఉణ్ణీ. అసలు మాధురికి, హృదయం ఉందనటానికి ఆడాక్టరు'నువ్వుచెప్పు మాధురీ' అంటే, ఆ శాస్త్రీవగైరా డైరక్షనేలేకపోతే, ఆనిష్కల్మష డాక్టర్‌కృష్ణ, సాధుత్వానికి ఎదురొడ్డిమాటాడేదా? ఆమెముఖంలో శెకనుకు, ఏవెయ్యోగా, మారిన భావాలు నేత్రాల వెల్లందనంలో చప్పబడి, ప్రతీకారాన్ని వెలువరించాయి' అన్నాను జ్ఞాపకపర్చుకుంటూ.

'ఆఁ ఉండవోయ్, నన్నడిగితే, ప్రభాత్ వారి ఉదయరేఖల్లో తానమాడిన ఫిలుం పరిశ్రమవద్దనుకున్నా,— తప్పేమిటిలే మంచివస్తువు ఎరువుకి- వచ్చిపులుముకుంది. గోపి, ఎద్దుబండిలో పాడుకుంటూపోతాడు; ఎక్కడికీ? బండీ, రైలూ, ఒకేపారలో నీడలాపోతాయి- వహ్వా...' రత్నం తనసినీమాజ్ఞానాన్ని వ్యక్తపర్చాడు.

'దైవశాసనంకన్న మానవశాసనమే యీ ప్రపంచాన్నేలుతోంది. రాధకన్నీటికాలువ, జీవితసారమింతేనా అనేపలుకులూ, న్యాయానికి చెవులు తప్ప కళ్లులేవు, అన్నమాటలూ, సంభాషణాక్రమంలో చాలతూచినట్లు, ఎంత యింపుగా, మధురాతిమధురాలై, హృదయాన్ని ఒక్కసారి కదలించి ఊరుకున్నాయో చూసారా' అన్నాను.

'గాంధిగారి విగ్రహానికి పోలికలు కొఱతవడ్డాయిరా' అన్నాడుగోపాలుడు.

'ఆంధ్రరత్నా గోపాలకృష్ణా' అబ్బ కళ్ళనీళ్ళు, కమలా నెహ్రూపటాన్ని కమ్మేశాయి నాకు' అన్నాను.

'నన్నడిగితే యీసీను చాలాబాగుందిలే' రత్నం అన్నాడిప్పటికి.

'అసలు అల్లాగే ఉండాలి. యీసీజులలో దేవుణ్ణీ దెయ్యాన్నీ పెట్టాడు కాదు కవి. ఎంతైనా బహూకరించాల్సిందే' అన్నాడు గోపాలుడు.

‘గాంధీగారివద్ద ఆపాట అనవసరమేమో... ఎల్లాగైతేం, పార్వతీ పరమేశ్వరులకు బదులు, గాంధీగారిలోంచి, ఆకాశవాణిపల్కిందీ’ అన్నాడు అచ్యుత్.

‘స్త్రీప్రకృతికి అవమానం తేవద్దన్న రాధ దేవురింపు దీనావస్థలో కొంత గాకపోతే కొంతైనా మాధురి కరగవల్సింది- ఎల్లామారుతుందిలే- రాధ, పద్యంలో, యిల్లా అవుతావల్లా అవుతావని, నిష్ఠురాలాడితే’ గోపాలుడు చమత్కరించాడు.

‘అపిచ్చిరాధని, వైటవేస్ నుంచి, అన్నివీధులు తిప్పాలేంరా? ఒకటీ కథకు స్వాభావికసహజపరిస్థితుల్ని కల్పించాడంటూ వేమిటీ’ అన్నాడు రత్నం.

‘న్యూస్ పేపరు యంత్రాల ప్రదర్శనం మాట’ మర్చంటు మధ్యలో గొణిగాడు.

‘దేవుడులేడూ? సత్యంలేదూ? అన్న రాధపల్కులకీ- డాక్టర్ (నిందితుడుగా బోనులో) కోర్టువారికి, తానీశిక్షకు తగుదునని కన్పర్చిన తన జీవితతప్పులకు, తనకిశిక్ష తగునని, తన యీమాటల ప్రమిరించండి అన్నపల్కులకీ ఏమైనా ప్రజలలో ఎఫెక్టు ఉండాలంటే- ఆకార్లు డీకొట్టించాక కాని- మాధురికి పశ్చాత్తాపం రాలేదనిపించటం, ఏమీ...’ అన్నాడు గోపాలుడు.

‘అదికాదోయ్ యిన్సూరెన్సూ! ట్రాజెడీ చేయించాల్సిన కథయిదీ’ అన్నాడు రత్నం.

‘హరిశ్చంద్ర హరిశ్చంద్ర...’ మర్చంటు మహోపాధ్యాయుని పల్కులు.

‘ఒరే! పతితజీవి, పలుబాధల, అల్లుకుపోయి, నిర్దోషిగా, ఉరిత్రాడు తగిలింపబడి, తుడిచిపెట్టుకపోయేకన్న, పతితమానవసేవకై, వదలింపబడటంలో, లోటుందంటూరావీరు’ అని ప్రశ్నించాను.

‘ఏమోకాని, తాత్కాలికంగా, పిచ్చివేషం, రాధకి- అవసరానికిలే-వచ్చి, వెంటనే, హరిజనసేవాసమితి కుటీరంలో ప్రథమంలో చూపబడ్డ గృహలక్ష్మిలా దర్శనమివ్వటం నాకేమో...’ అన్నాడు గోపాలుడు.

వెనకాలే నాకుర్చీవెనకనుంచి ఏవో ఆలోచనలో మాటాడిబోయిన, నాకు, కళ్లపై పూలహస్తాల కప్పింది, మాకుసుమం.

‘అమ్మదొంగా! అన్నాను నవ్వుకుంటూ.

‘అమ్మ!—అన్నానికీ...’ అంటూ కిలకిలమంది.

‘డాక్టర్ ఖద్దరుధారణ, గాంధీమహాత్మాకీజై అనే ప్రేమా, భక్తీ, విజయగీతాలైన కథాంతంసింప్లీ అంటూన్న నామాటలోనే ఎక్సలెంట్ అంటూ కుర్చీలకు విశ్రాంతినిచ్చారు మావాళ్ళంతా.



సారథి ఫిలుమ్సు వారి ‘మాలపిల్ల’ లో

Printed at the Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.

కుబేరా ఫిలిమ్సు వారి

# భక్త మార్కండేయ

పూర్తిగా తయారైనది.




భక్తి, ముక్తి, శక్తి, రక్తి లతో రానున్నదని ఘంటా పథముగ నమ్ముడి.

నటీనటకులు :

జి. యస్. స్వామి, గగ్గయ్య,
జి. రాధాకృష్ణయ్య,
రామకృష్ణశాస్త్రి, రాయప్రోలు,
రామశాస్త్రి, శేషాచలం,
నరశింహారావు, విశ్వనాథం,
రామబ్రహ్మం, గోపాలరావు,
శ్రీరంజని, శాంతాకుమారి,
శకుంతల, మహాలక్ష్మి,
జయగౌరి మున్నగువారు.

డైరెక్టర్ :
చిత్రపు
నారయణమూర్తి, బి. ఏ.

అసిస్టెంటు డైరెక్టర్ :
ఈ. యస్. యన్. మూర్తి.

చిత్రకళ :
టి. వి. యస్. శర్మ.

సూపర్ వైజుడు సంగీత పర్యవేక్షణ:
గాలి పెంచలు నరశింహారావు.

*For Booking Apply to:*

**Kubera Films Ltd.**, 80 Poonamalli High Road, Kilpauk, Madras.

# మీరు చూడవలసిన మా జాబులు

ప్రియపాఠకమహాశయులారా!

మేసంచికలోని వ్యాసములనుగూర్చి మీలో కొందరు లేఖామూలమున తెలిపిన కొన్ని భావములను ఇచట ప్రదర్శించుచున్నాము. ఇట్లే ఈ సంచికలోని వ్యాసములనుగూర్చి అనుకూలమైనవిగాని ప్రతికూలమైనవిగాని అయిన మీ అభిప్రాయములను ఏమైన చెప్పదలచినచో లేఖామూలమున మాకు తెలియజెప్పుడు. పైమాసపు ఆంధ్రభూమి ముఖమున వానిని ఆంధ్రలోకమును అందజేయుదుము. మీయింగితము మాకును, మా వ్యాసకర్తలకును చుక్కానివంటిది.

—సంపాదకుడు.

౧

...నాగేశ్వరరావు పంతులుగారిని గూర్చిన మీసంపాదకీయం చాల ఉత్తేజకరంగావుంది. అందు మీరు పంతులుగారిని జాతీయమహావీరునిగా నిరూపించడం లెస్సైవుంది...

—కోట నరసయ్య.

౨

...'గృహలక్ష్మిటాకీ'ని గూర్చిన విమర్శకవ్యాసం ప్రతిభాయుక్తంగావుంది. కాని చివరికి మంచిచెడ్డలు నిష్కర్షగా చెప్పబడలేదు...

—సి. హెచ్. రామస్వామి.

౩

...గతసంచికలో తిక్కన్న-కీచకునివలపును గూర్చిన అభిప్రాయం ఇచ్చినవారిపేరు ఎచ్చటా పేర్కొబడలేదు. అది వ్రాసినది ఎవరో ఈనెల సంచికలోనేనా తెలపండి...

—జి. వెంకటరావు.

౪

...చిరుమామిళ్ళ శివరామకృష్ణప్రసాద్, బి.ఏ. గారి సారస్వతవ్యాసము చాలాబాగున్నది. వారిచే మరికొన్ని సారస్వతవ్యాసాలు వ్రాయిస్తే బాగావుంటుందని నా అభిప్రాయం...

—తోలేటి గంగాధరం.

౫

...'ఆంధ్రుణ్ణయిన నాతడాఖా' అనే కథావ్యాసం కావ్యశిల్పంలో ఉత్తమస్థానాన్ని ఆక్రమించకపోయినా మద్రాసులో తెనుగు విద్యార్థులు పొల్పడే అభాసుపనులను చమత్కారంగా చెప్పి పొడుస్తూ గొప్పనీతిపాఠాన్ని బోధిస్తూ వుంది... —దుర్భా గంగన్న.

౬

...'భార్యవయోధికవితేమంచిది' అనే వ్యాసం హాస్యజనకంగావుంది. ఒకటి రెండుచోట్ల అసభ్యంగావుందని చెప్పకతీరదు...—మంతెన తాతంరాజు.

౭

...'దూరాన్నుంచి చిరుగంటలచప్పుడు' అనే కథావ్యాసంలోని భాష సంస్కారాన్ని కోరేదిగావున్నా భావం మహనీయమైందిగా వుంది ..

—శ్రీపాద కృష్ణమూర్తి.

౮

...భావరాజు నరసింహారావుగారి 'లోకసత్యాలు' చదివి నేను మంచి ఆనందాన్ని పొందాను. అవి చాలా ఆదర్శప్రాయంగా వున్నాయి...

—కె. వెంకటేశ్వర్లు.

౯

...'మేము కళ్ళికోట వెడుతున్నాం' అనే వ్యాసం నాకేమీ రుచిగాలేదని వ్రాసినందుకు మన్నించండి...

—వి. జగన్నాధం.

౧౦

శ్రీమతి బులుసు ప్రకాశమ్మగారి 'సహంలోనే తాటాకులు' అనే కథ ముచ్చటగాఉంది. మన స్త్రీలు అంత పగడబందీగా కథలు వ్రాయగలుగుచున్నందుకు నిజంగా మనం గర్వించాలి.

—బి. శామ్యూల్.

# తిక్కన్న-కీచకునివలపు

జనవరిసంచికలో శ్రీదేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు సంగ్రహించి ప్రచురించిన తిక్కన-కీచకునివలపు ఘట్టపు పద్యములనుగూర్చి ఆంధ్రవిద్వాంసులు పదిమంది పంపిన అభిప్రాయములను ఫిబ్రవరి,మార్చి, ఏప్రెల్, మే సంచికలందు ప్రచురించి యున్నాము. మేసంచికలోని అభిప్రాయము ఉభయభాషాప్రవీణ శ్రీ అబ్బరాజు వీరరాఘవయ్యగారిది. ఈ పది అభిప్రాయములు సమన్వయముచేసి అవలోడించుచు నొక విమర్శకవ్యాసము జూలై మాసపు ఆంధ్రభూమిలో ప్రచురింపబడుననిమనవి.

—సంపాదకుడు.